*Issued—20-8-1954*






# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## SATURDAY, 28th NOVEMBER 1953

## VOLUME 1—No. 5

*CONTENTS*



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS

BY GORDON PRESS, GUNTUR-2.

1954

PRICE, 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

**SATURDAY, 28th November 1953.**

The House met in the Assembly Chamber, Kurnool, at thirty minutes past ten of the Clock, Mr. Speaker (the Hon. Sri N. Venkatramaiya) in the Chair.

*[Note:—(*) An asterisk at the commencement of the speech indicates correction by the Member.*

## I. ALLOTMENT OF A NON-OFFICIAL DAY FOR DISCUSSION OF THE QUESTION OF THE LOCATION OF THE CAPITAL OF ANDHRA GOVERNMENT.

* Sri N. V. Rama Rao:—అధ్యక్షా ! ప్రభుత్వాన్ని ఒక విషయం అడగవలెనని భావిస్తున్నాను. నిన్న నేను చెప్పిన ఉపన్యాసంలో మన శాశ్వత రాజధాని విషయంలో చాలా దూరదృష్టితో ఆలోచించవలసిందని ప్రభుత్వానికి నేను విజ్ఞప్తిచేసి ఉన్నాను. మరి ఈ శాశ్వత రాజధాని విషయంలో గవర్నరు ప్రసంగం అభినందన తీర్మానమునకు మేము పెట్టిన సవరణాల విషయంలో ప్రభుత్వం non-official day allot చేయక పోవుటవలన గత్యంతరం లేక ఆ విధంగా చేయవలసి వచ్చింది. ఇప్పుడైనా శాశ్వతరాజధాని నిర్ణయం గురించి చర్చించుటకు ప్రత్యేకంగా ఒక రోజును నిర్ణయించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ఈ విషయమై ప్రధాన మంత్రిగారికి ఉప ప్రధాన మంత్రిగారికి కూడా ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను. అంచేత నే చెప్పేదేమంటే ఒక నానఫిషియల్ డే allot చేసినట్లైతే బాగుండేదని, అందరూకూడా బాగా ఆలోచించి చేయవలసిందని, అంచేత నేనిప్పుడు ప్రభుత్వాన్ని, ప్రధాన మంత్రిగారిని కోరేదేమంటే ఈ రాజధానిపై చర్చించడం కోసం ఒక ప్రత్యేకమైన రోజు కేటాయించాలని కోరుతున్నాను. వారు ఆ విధంగా చేస్తారని నేను నమ్ముతున్నాను.

The Hon. Sri T. Prakasam:— నేను నానఫిషియల్ రోజును నిర్ణయించాలని చెప్పి ఇదివరకే నిశ్చయించుకొన్నాను, అయితే ఇక్కడ చెప్పవలసినటువంటి అవకాశం రాలేదు. ఈ విషయాన్ని గురించి నేను మొదట్లోనే చెప్పా 'ఇన్ని సవరణలు వచ్చాయి. ఈ సవరణలన్నిటిమీద బాగా చర్చలు

10-40 a.m.

జరుగుతున్నాయి, ఆలోచించిన మీదటే నానఫిషియల్ డే ఒకటి ఏర్పాటు చేద్దాం' అని. అందుకనే నేను కోరిందికూడా అందరూ సవరణలు ఉపసంహరించుకుంటే ఆ నానఫిషియల్ రోజును గురించి విచారించడానికి అవకాశం ఉంటుందని నేను మనవి చేస్తున్నాను. సోమవారం......

Sri C. V. K. Rao:—On a point of order, Sir. గతసారి నేను ఇచ్చినటువంటి ప్రివిలేజెస్ మోషన్ గురించి ఈ రోజున చర్చ చేస్తాం అని...... ఈ సభను అగౌరవ పరచారని ఒక నోటీసు ఇచ్చాను......

Mr. Speaker:— దీనికి point of order అవసరం లేదు. ఇది పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్‌గా వస్తుంది. నాకు వ్యవధి లేక పోవడం వల్ల నేను చూడలేదు అది ఆ admissibility మీద......

Sri M. Venkata Subba Reddy:— అధ్యక్షా! ఇప్పుడు గవర్నరుగారి ఉపన్యాసంపై చర్చ వాయిదా వేయాలనేటటువంటి ప్రతిపాదన, ఇది గవర్నమెంటు పై విశ్వాస రాహిత్య తీర్మానంగా పరిగణించబడవలసిఉంది; విశాలాంధ్ర ఉద్యమం శాశ్వతరాజధాని ముక్కోటి ఆంధ్రుల మీద ఆధారపడి ఉంది. కాబట్టి వాళ్లయొక్క భవిష్యత్తు నిర్ణయించడానికి సంసిద్ధులమై ఉండాలి. ఆంధ్ర మహాసభ అధ్యక్షులుగా ఉండి ఏనుగులపై ఊరేగించబడినటువంటివాళ్లు ఆంధ్రలో ఉన్నారు. ఆ పదవిని కాళ్లదన్నైనా సరే, హైద్రాబాద్ విశాలాంధ్ర రాష్ట్ర రాజధాని కావాలి. ఆ తీర్మానం పై సవరణలను విరమించుకోడానికి వీలులేదు. నా సవరణలను నేను ఎంత మాత్రం ఉపసంహరించుకో లేను.

* Sri Vavilala Gopala Krishnayya:—అధ్యక్షా! ఇక్కడ ఒక సమస్య వచ్చింది. నానఫిషియల్ డే ఇవ్వలేదు కనుక గవర్నరు ఉపన్యాసము మీద, రాజధాని సమస్యపై సవరణలు తేవడం జరిగింది. అంతాకూడా దానికి అనుగుణంగా ఉండేట్టు పంపించారు. ఈ నానఫిషియల్ డేని గురించి వెంటనే ఆలోచించినట్లైతే, గవర్నరు ప్రసంగముపై ప్రసక్తియే వచ్చేదికాదు. కాని ఇప్పుడు రామారావుగారు గవర్నరు ఉపన్యాసము మీద సవరణలను తేవడం ప్రభుత్వంపై విశ్వాస, అవిశ్వాస ప్రకటనలుగా పరిగణించుట

జరుగుతుంది కావున, తమ సవరణలు ఉపసంహరించుకుంటామంటున్నారు. అందువల్ల ఇది ఆలోచించవలసి వస్తుందేమో అని అన్నాను. అందుచేత ఇది కాన్ఫిడెన్స్ మోషన్‌గా పరిగణింపబడవలసి వస్తుందేమో అనే భయంచేత నానఫిషియల్ డే విషయం అయితే ఆలోచించగలముకాని, కాన్ఫిడెన్సు సమస్య వస్తుంది గనుక విచారించుచున్నాం అంటే దాన్ని గురించి సీరియస్‌గా ఆలోచించవలసి వస్తుంది. అంచేత మాకు ఈ గవర్న మెంట్ ఉన్నా పోయినా ఒకటే. ఉంటుందా, పోతుందా అనే ప్రసక్తితో మాకు సంబంధం లేదు.

Sri N. V. Rama Rao:— నాకు ప్రభుత్వం మీద విశ్వాసం ఉంది. అది అందరితోటి చెప్తున్నాను. అది ఎవర్తు చేయడానికి......

* Sri Vavilala Gopala Krishnayya:—అది ఎవర్తు చేయడం వల్ల చాలా సీరియస్‌గా ఆలోచించవలసి ఉంటుంది. అందువల్ల దీనిమీద ఒక నిర్ణయం చేసుకోడానికి ముందు ముఖ్యమంత్రి ప్రకటన వస్తుందన్నారు. లోపల జరిగిన అరేంజిమెంట్స్ మాకు తెలియవు. మాకు వాటితో సంబంధం లేదు. ఎంచేతంటే ప్రధాన మంత్రిగారు ఈవేళ ఎవో చెప్తాం అన్నారు. ఇది నానఫిషియల్ డేగా వస్తుందని మొదటే చెప్పితే ఈ బెడదే తీరిపోయేది. ఈ విషయము ఆలోచించవలసి వుంది.

Sri G. Satyanarayana:—Point of order. అధ్యక్షా! ఇప్పుడు నిన్న ఇక్కడజరిగినటువంటి చర్చల సందర్భంలో, గౌరవనీయులు సుబ్బారెడ్డి గారు రాజీనామా ఇస్తున్నానని మీ ఎదుటే చెప్పారు. నిన్ననే ఇచ్చినట్టి రాజీనామా పత్రం మీకు చేరిందా లేక వారు సత్యవిరుద్ధమైన సమాచారం మాకు తెలియ పరచారా ?

Mr. Speaker:— ఇందులో point of order ఏమీ కనపడలేదు. సభ్యులు ఎవరైన resignation ఇచ్చిఉంటే, అది నా దగ్గరకు వచ్చి, దానిని నేను accept చేసిఉంటే, ఆసభ్యులు ఇక్కడకూర్చొనడానికి వీలులేదు. మీరు చెప్పుతున్నటువంటి సభ్యులు ఇక్కడ ఉన్నారు గనుక వారింకా resigna- 10-50 a.m.

tion ఇవ్వలేదని, దానిని బట్టే గ్రహించుకోవచ్చును. నాదగ్గరకు ఏ resignation రాలేదు.

Sri K. V. S. Padmanabha Raju:— ఈ రాజధాని విషయములో ఒక పాలిసీ, ఒక నిర్ణయం ఉండాలి. ప్రభుత్వము ఈ విషయము తీసుకు రాకపోయినప్పటికి మేము ఈ రోజున గవర్నరు అడ్రసుకు సవరణ రూపములో తీసుకొని వచ్చాము. కనుక ఈ విషయంలో సభ్యుల అభిప్రాయము తెలుసుకొని ఆ విధంగా ప్రభుత్వము నిర్ణయించుకొనవచ్చును. దీని కొరకు మరల ప్రత్యేకముగా non-official resolution తీసుకొని రావలసిన అవసరం లేదు. కనుక మా సవరణలను ఉపసంహరించుకోవడం లేదు.

* Sri Pragada Kotaiah :— ఈ రాజధాని సమస్య మంత్రి వర్గం పైన విశ్వాస ప్రకటన అగునా, లేదా అంటే, ఆ ఉద్దేశ్యంతో ఈ సవరణలు తీసుకొని రాలేదు. ముఖ్యంగా రాజధాని సమస్యను పరిష్కరించే నిమిత్తం ఒక non-official day ను ఇవ్వడానికి ప్రభుత్వము అంగీకరిస్తున్నందువలన గవర్నరుగారి అడ్రసుకు Thanksgiving resolution కు ఇచ్చినటువంటి సవరణలను, ఉపసంహరించు కొంటున్నాను. ఇతర మిత్రులు ఆ విధంగా చేయవలసిందని కోరుతున్నాను. దీనివల్ల విషయములో ఏమీ మార్పు ఉండదు. సవరణ రూపము పోయి తీర్మానం రూపము వస్తుంది. అంతకంటే వేరే మార్పు లేదు. కనుక ఇతర మిత్రులు కూడ ఆ విధంగా చేయవలసిందని కోరుచున్నాను.

Sri T. Nagi Reddi :—అధ్యక్షా, అసలు ఈ రాజధాని సమస్య ఈ విధంగా చర్చకు వస్తుందని కొంతవరకు ప్రభుత్వము ఊహించి యుండవచ్చును. ఎందుచేత నంటే, ప్రతిపక్షములో ఉన్నటువంటి మేము ఈ సమస్యను confidence తీర్మానముగా తీసుకొనుటకు వీలులేకుండునట్లుగా, దీనిపైన ఒక ప్రత్యేకమైన చర్చకు అవకాశమివ్వాలని మొదటినుంచిగూడ చెప్పుతూవచ్చాము. ప్రభుత్వము ఆ విధమైనటువంటి అవకాశము ఇవ్వనందువనే, ఈ సమస్య ఈనాడు గవర్నరుగారి అడ్రసుకు ఇచ్చేటటువంటి

28th November 1953] [Sri T. Nagi Reddi]

అభినందన తీర్మానానికి సవరణ రూపములో వచ్చినది. కాబట్టి ఈ విధ మైనటువంటి సవరణలు వస్తాయని ప్రభుత్వానికి తెలియదు అని చెప్పితే, చాలా ఆశ్చర్య పడవలసియుంటుంది. మనము ఈ సమస్యను ఈ విధంగా ఎందుకు తీసుకొని రావలసి వచ్చిందనేటటువంటి విషయము గత 2 నెలల చరిత్ర స్పష్టము చేస్తుంది. ఈ సమస్యను ఈ సభకు తీసుకొని వచ్చుటకు మరొక పద్ధతి, మార్గము లేనందున, ఈ విధముగా దీనిని తీసుకొని రావలసి ఉంటుందనే విషయాన్ని మీ ముందు పెట్టాము. ఈ విషయాన్ని గురించి చర్చించినాము. ఆ తరువాత మన Legislature Party కార్యదర్శి గవర్నరును కలుసుకొనినప్పుడు దానిని గురించి చర్చించారు. ఈ సమస్యను, గవర్నరు అడ్రసుకు ఇచ్చేటటువంటి Thanksgiving Motion కు సవ రణగా తీసుకొని వచ్చేదానికంటే వేరే విధంగా చర్చించడం బాగుంటుందని కమ్యూనిష్టు లెజస్లేచర్ పార్టీ సూచించినప్పుడు, ఈ సూచనను ప్రభుత్వం అంగీకరించలేదు. ప్రతిపక్షముయొక్క ఈ సూచనను అంగీకరించక పోయిన కారణంచేత, ఇప్పుడు దానిని గవర్నరు అడ్రసుకు amendments రూప ములో మీ ముందు పెట్టవలసి వచ్చిందని తెలియచేస్తున్నాను.

ఇక పోతే, ఈ రాజధానిని గురించిన సవరణను ఈ చర్చలో రానీయ కుండా, రకరకాలైన points of order తెస్తూ ప్రభుత్వము ప్రయత్నిం చింది. ఆ ప్రయత్నములుకూడ విఫలమైన తరువాత, 2 దినములు దీని మీద దీర్ఘమైన చర్చలు జరిగిన తరువాత, ఈనాడు ఈ సవరణలను ఉప సంహరించుకొమ్మని, దీనికి ప్రత్యేక అవకాశము కలుగజేస్తామని ప్రభుత్వం చెప్పుచున్నదంటే, ఇది అంత సులభముగా అంగీకరించుటకు వీలుకాదు. అంగీకరించేముందు, దీనియొక్క లోతుపాతులు గమనించి ఆలోచించవలసి యుంటుంది. ఇప్పుడు ఈ సమస్యను చర్చించుటకు ప్రత్యేకముగా ఒక non-official day ఇస్తామని అంటున్నారు. ఈ సందర్భంలో ఈ non-official తీర్మానంయొక్క చర్చ ఒక దినములో ముగించుటకు వీలవు తుందా, దీనిని ఎన్నిరోజులు చర్చించవచ్చును, ఎప్పుడు పూర్తికావాలి. అది పూర్తి అయ్యేవరకు అవకాశ మిస్తారా, అనేటటువంటి విషయము లలో ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి రావలసి వుంటుంది. దీనిమీద చర్చ పూర్తిచేస్తామని, ఇది పూర్తిచేసేవరకు వేరే ఇతర విషయా లేవీ తీసుకో

బడవని, ప్రభుత్వము హామీ ఇవ్వవలసి యుంటుంది. మామూలుగా, ఇదివరకు ఉన్న అనుభవాన్ని బట్టి చూస్తే, సాధారణముగా ఒక non-official day నాడు ఒక విషయము చర్చకువస్తే ఆ చర్చ ఆ రోజున పూర్తిగాకపోయినట్లైతే, దానిని మరల next non-official day కు వాయిదావేయడం, ఆ next non-official day ఎప్పుడు వస్తుందో తెలియకపోవడం ఈ విధంగా జరుగుతూ ఉంటుంది. ఈ రకంగా non-official business పూర్తికాకుండా ప్రభుత్వం ప్రయత్నిస్తూ ఉంటుంది. కనుక ఇటువంటి ప్రయత్నం ఈ విషయంలో చేయను అని ప్రభుత్వము హామీ ఇస్తుందా అనేటటువంటిది చాలా ప్రధానమైనటువంటి విషయము. ముఖ్యంగా ప్రభుత్వము ఈ సమస్యపైన చర్చలేకుండా చేయుటకు నిన్న మొన్న చేసిన ప్రయత్నాలను చూస్తే, చాలా అనుమానపడవలసి ఉంటుంది. అదీకాకుండా, మేము మొట్టమొదటనే, ముందుగానే, ఇది no-confidence issue గా తీసుకొనడానికి వీలులేకుండా, దీనిని non-official తీర్మానముగా చర్చించి పూర్తిచేయడానికి అవకాశమిమ్మని అడిగాము. దానికి అంగీకరించలేదు. ఆ తరువాత ఆ సమస్యను ఈ సవరణ రూపములో పెట్టగా ప్రకాశం, విశ్వనాథంగార్లు ఈ సవరణలు చర్చకు రాకుండా చేయుటకు ప్రయత్నం చేశారు. ఇవన్నీ చేసిన తరువాత, ఇపుడు ఈ సవరణలను ఉపసంహరించుకోండని, దీనికి ప్రత్యేకంగా సోమవారము non-official day ఇస్తామని అంటున్నారంటే, దీనిని జాగ్రత్తగా పరిశీలించవలసియున్నది కనుక, నేను చెప్పేనది, సోమవారమునాడు ఈ non-official తీర్మానాన్ని తీసుకొనినప్పుడు, ఈ చర్చకు ఏవిధమైన disturbance కలుగజేయకుండా House ను ఏవిధంగాను postpone చేయకుండా ఈ చర్చ పూర్తిఅయి ఒక తీర్మానానికి వచ్చేంతవరకు ఇంకొక సమస్యను తీసుకోకుండా ఉండేటట్లు హామీ ఇవ్వగలరా? దీనికి ఏమి సమాధానము చెప్పుతారని అడుగుచున్నాను.

తరువాత non-official day నాడు ఏవైన ఇతర తీర్మానాలుగూడ వచ్చినట్లైతే అప్పుడు సాధారణముగా ballot వేసి ఏది ముందువస్తే దానిని ముందుగా తీసుకోవడం, తరువాత వచ్చింది తరువాత తీసుకోవడం, జరుగుతుంది. అప్పుడు ఈ తీర్మానము ముందురాకుండా మరొక తీర్మానం ముందు

వస్తే, దాన్నే ముందుగా తీసుకొంటామని చెప్పవచ్చు. అప్పుడు మేము కాదన్నప్పటికి, ప్రభుత్వమువారు point of order చెప్పడము, constitution rules సూచించడం మొదలగునవి జరుగవచ్చు. కనుక అటువంటి చిక్కులు, అడ్డంకులు ఏవీ పెట్టకుండా, ఈ తీర్మానాన్ని మొదట తీసుకొని దీనిమీద చర్చ పూర్తిచేసి, ఒక నిర్ణయానికి వచ్చేంతవరకు, ఇతర సమస్యలు తీసుకొనడంగాని, House adjourn చేయడంగాని మరి ఇతర disturbance ఏదీ కలుగజేయడంగాని, ఇటువంటి ఏ అభ్యంతరాలు, కలుగకుండా చర్చ జరిపిస్తామని హామీ ఇవ్వగలరా అని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. దీనికి సమాధానము ఇవ్వవలసిందని కోరుచున్నాను.

The Hon. Sri T. Viswanatham :—నాగిరెడ్డిగారు చాలా పొరబాటు పడుతున్నారు. ఈ సమస్య చర్చకు రాకుండా చేయాలని నేను point of order చెప్పానని అన్నారు. నేను ఆ point of order చెప్పడంలో అసలు ఈ సమస్య చర్చకు రాకూడదని గాదు. గవర్నరు అడ్రసు సందర్భంలో రాకూడదని చెప్పానుగాని, వేరే విధంగా రాకూడదని గాదు. కనుక వారు ఈ విషయములో పొరబాటుబడుతున్నారు. 11-0 a.m.

Sri T. Nagi Reddi:— ఈ సందర్భములో రాజధాని సమస్య వస్తుందని ప్రపంచానికే తెలుసు.

The Hon. Sri T. Viswanatham:—నేనుకూడ ప్రపంచములో ఉన్నవాడనే. మనకు వాదోపవాదాలు ఉండకూడదు. అసలు సంగతి వినండి. గవర్నరు అడ్రసులో లేని విషయములపైన సవరణలు తీసుకొనిరావడం అసందర్భమని అన్నాను. దానికి constitution ఒప్పుకోదు. ఈవేళ ఈ సమస్య వచ్చింది. రేపు ఇదేవిధంగా అసందర్భంగా ఉండే ఇంకొక సమస్య రావచ్చును. కనుక ఈ పద్ధతి తప్పు అని constitution లో వ్రాసినది తెలిసిన తరువాత, అది point out చేయడము ధర్మమని point out చేశాను. దానిమీద రూలింగు ఇచ్చేటటువంటి బాధ్యత స్పీకరుగారిది. అంతేగాని, ఇందులో నా ప్రయత్నమనేది ఏమి లేదు. అంతేగాకుండా, నెలరోజుల క్రిందట, ఈ రాజధాని సమస్యపైన చర్చకు ఈ sitting లో

[The Hon. Sri T. Viswanatham] [28th November 1953

అవకాశముంటుందా లేదా అని అడిగితే, దీనికి అవకాశము ఇవ్వకపోవ డానికి ఏమి కారణమున్నది, అయితే గవర్నమెంటు స్వయముగా ఈ సమ స్యను చర్చకు తీసుకొని రాకపోవచ్చును, కాని ఒక non-official తీర్మానం తీసుకొనివస్తే, దానికి 1, 2 రోజులు అవకాశమివ్వడానికి ఏమి అభ్యంతర ముండదని చెప్పాను. ఆవిధముగా చేసి ఉన్నట్లైతే, ఈ ఆపోహ ఉండక పోయెడిది. కాని ఇప్పటికైనా ఈ సమస్యను non-official తీర్మాన రూపములో చర్చించుటకు 1, 2 రోజులు వ్యవధి ఇస్తామని ముఖ్య మంత్రి గారు చెప్పినతరువాతగూడ దీన్ని సందేహించుట ఎందుకో అర్థంకావడం లేదు. అసందర్భంగా దీనిని తీసుకొని వచ్చినపుడు, అది సరికాదని రూలు చూపించడంలో ఒక motive ఉన్నదని చెప్పడం మంచిది కాదని మనవి చేస్తున్నాను.

* Sri Pillalamarri Venkateswarlu:— మాకు అనుమానంగా వున్న విషయాలను ప్రభుత్వం ముందర పెడితే ఇందులో తప్పేమి ఉన్నది? ఈ విషయంలో ఇంకొక అనుమానం కూడ ఉన్నది. ఒకవేళ కొంతమంది సభ్యులు పట్టుపట్టి, ప్రభుత్వం మీద confidence ఉన్నదా లేదా అనే విషయము ఇప్పుడే తెలుసుకోవాలని, వారి సవరణలను ఉపసంహరించు కోకుండా press చేసి నట్లైతే, అది ఓడిపోయిన తరువాత, మరల అదే విషయంపైన non-official తీర్మానం వచ్చేదానికి అవకాశముంటుందా, అప్పుడు ఏలాటి అభ్యంతరం ఉండదా అని అడుగుచున్నాను. ఈ విష యములో స్పీకరుగారు తమ రూలింగు ఇవ్వాలని కోరుతున్నాను. ఏలాటి అభ్యంతరం ఉండదని రూలింగు ఇచ్చినట్లైతే మాకు అనుమానం ఉండదు.

తరువాత రెండవది, ఇప్పుడు ఈ గవర్నరు అడ్రసుకు చాలా సవర ణాలు ఇచ్చారు. ఇవ్వే రేపు తీర్మానాల రూపములో వస్తున్నాయి. అప్పుడు విశ్వనాథంగారు, వీటికి notice ఇవ్వలేదని point of order చేసి ఆటంక పరచవచ్చును. కనుక ఈ విషయములో నేను ఒక సూచన చేస్తున్నాను. ఇప్పుడు, మనము ఒక non-official day ను నియమిస్తున్నామంటె, ఒక ప్రత్యేక సమస్యకొరకు, ప్రత్యేక పరిస్థితులలో, చర్చించుటకు గాను నియమిస్తున్నాము. అటువంటప్పుడు, సాధారణముగా non-official

తీర్మానములకు వర్తించే rules, ఈ సందర్భమున వర్తింపచేయకుండా, విశ్వనాథంగారు, దీనికి 10 రోజులు, నోటీసు ఇవ్వవలసి యుంటుంది, 12 రోజులు ఇవ్వవలసి ఉంటుంది అనే అభ్యంతరాలేవి చెప్పకుండా, మనలో మనము ఒక పద్ధతిని అనుసరించుటకు అందరు అంగీకరిచినట్లైతే బాగుంటుంది కనుక, ఇప్పుడు ఇచ్చినటువంటి సవరణలనే ప్రభుత్వము తీర్మానములుగా భావించి, వాటిని ఆవిధంగా circulate చేసినట్లైతే, ఏలాంటి అభ్యంతరం ఉండనవసరంలేదని సూచిస్తున్నాను. దీనిమీద ప్రభుత్వంయొక్క, అధ్యక్షుల యొక్క అభిప్రాయాలు తెలుసుకోన గోరుచున్నాము.

Sri C. V. K. Rao:— On point of order, Sir. మొట్టమొదట ఈ సవరణలు ప్రతిపాదించేటప్పుడు, ఇది admissible అవునా కాదా అని ప్రశ్న వచ్చినప్పుడు, ఇది admissible అని అధ్యక్షుల వారు రూలింగు ఇచ్చారు. అయితే ఈ నాడు ఈ సవరణను ఉపసంహరించుకొని దానినే ఒక non-official తీర్మాన రూపములో తీసుకొని వచ్చుట admissible కాదు అన్నట్లుగా ఒక వాదన ప్రభుత్వ బెంచీలో నుంచి వస్తున్నట్లు కని పిస్తున్నది. ఆ విషయమై మీ అభిప్రాయము అడుగుచున్నాను.

Mr. Speaker:— అటువంటిదేవి రాలేదు.

Sri K. Rajagopala Rao:— Non-official తీర్మానములకు 15 రోజులు notice ఇవ్వాలని అంటున్నారు. 15 రోజులు నోటీసు ఉన్నా లేక పోయినా - సమస్య ప్రాముఖ్యతను, అవసరాన్ని బట్టి అధ్యక్షులు admit చేయవచ్చునని రూల్సులో provision ఉన్నది. అది మీ దృష్టికి తెస్తు న్నాను.

The Hon. Sri T. Prakasam:— అధ్యక్షా, నాగిరెడ్డిగారు చెప్పిన విషయాలకు సంబంధించి మొదటి నుంచి కూడా యీ సంగతులు అన్నీ కూడా చెప్పుతూ వున్నాము. ఎదుట పార్టీ వారికి తెలుసును. Non-official day గురించికూడ మేము అడిగామని చెప్పియున్నారు. నాకు తెలిసినంతమటుకు నేను తరువాత ఆక్షేపణలు చేసినా, rules కోసము కనిపెట్టుకుని వుండ 11-10 a.m.

[The Hon. Sri T. Prakasam] [28th November 1953

కుండా యీ amendments విషయమై నేను మొదటనే మనవి చేశాను. ఏమిటంటే యిటువంటి resolution మీాద, యిటువంటి సవరణలు చెప్పినా, పేరుతోటి, యివన్నీ యిచ్చివుండకూడదు. కాబట్టి వాటిని అంగీకరించడానికి నేను ఆక్షేపణ తెలియజేశాను. చేస్తే మీారు resolutions గా తీసుకుని, చదివి, దానికి సవరణలు పెట్టవచ్చునని, కర్నూలు మీాద సవరణలు attempt చేసుకోవచ్చునని చెప్పారు. అంతేకాదు, యింతకంటే అటువంటి తీర్పులు చెప్పిన తరువాత చర్చజరిగించేకాని, మొదటి నుంచి non-official day యివ్వమని, మీారు అంగీకరించమని చెప్పడంలో అర్థంలేదు. ఏదైనా సరే rules లో మీాకు అధికారం వున్నాసరే లేకపోయినా సరే, rules లో యిటువంటి తీర్మానం మీాద చర్చలు జరిపించకూడదు. ఈ సవరణ వుండ కూడదు అని చెప్పిన నా ఆక్షేపణకు సరియైన తీర్పుచెప్పారు. దానితో అది అయిపోయింది. మనము విస్తారమైన time తీసుకొననవసరం లేదు. Non-official day యిప్పుడు యిచ్చారు. సవరణలు అన్నికూడ resolutions క్రింద పెట్టుకోవలసినదని సూచన చేశారు. అది ఎంతమాత్రము చేయటానికి వీలులేదు. ఆ ప్రకారం కోరడం కూడ న్యాయముకాదు. అనేకమైన సవరణలు వస్తాయి కాబట్టి యిప్పుడు non-official day సోమవారము ఏర్పాటుచేస్తే సోమవారమునాడు పూర్తిగా చర్చచేసి, సోమవారం నాడే పరిష్కారం అవుతుందనే ఆశతో మీారు అన్నారు. మేముకూడ అట్లాగే అనుకున్నాము. మీారు అనుకున్నట్లు, ఆ వంక, యీా వంక పెట్ట డానికికూడ కాదు, అని చెప్పేటటువంటివి మాతరఫున చేయడానికి చెప్ప వలసిన అవసరమేమీా లేదు. ఏదైనా వంకరమార్గముగా పెట్టుకొని తప్పించు కోవడానికి చేసేది ఏమీాకాదు. తప్పించుకొనడానికి మేము అటువంటి పని యేమి చేయము. కనుక non-official day వుండటానికి సందేహమేమీా లేదు. మేము ఆలోచించే చెప్పివున్నాము. ఆ రోజు సోమవారంనాడు ప్రత్యేకంగా దానికోసం అనేచెప్పి, ఎంతో ఆతురతతో చర్చజరగాలనే వుద్దేశ్యంతో non-official day ఉండాలని మేము ఆమోదించవలెనని అనుకుంటున్నాము. అది చెప్పవలసిన time వచ్చినప్పుడు మేముచెప్పాము కాని, అంతకన్నా యేమి లేదు.

28th November 1953]

Mr. Speaker:—ఇప్పుడు Chief Minister గారు యిప్పుడు వారికి వున్న సందేహాలు చెప్పినదాంట్లో మూడు విషయాలు అవసరమని తోచుచున్నది. సోమవారమునాడు non-official day యివ్వడమా అనేది ఒకటి ; సోమవారమునాడు non-official day యిస్తామా ? Leader of the House (యిస్తున్నారని) ఒప్పుకున్నట్లు నేను భావిస్తున్నాను. రెండవది యేమిటంటే, rules resolution యేది అయినప్పటికినీ 15 రోజులు notice లేకుండా పంపించినట్లైతే, దానిని agenda లో పెట్టడానికి వీలులేదని అంటున్నారు. అయితే Constitution లో నేను 15 రోజుల notice లేకుండా యే resolution అయినా accept చేయటానికి అవకాశం వుంది, ఇప్పుడు రాజ్యాంగ చట్టం 120 proviso ప్రకారం 15 రోజుల notice అవసరం లేకుండా ఎజెండాలో పెట్టడానికి కూడ వీలుందని assurance యిస్తానని నేను అంటున్నాను. తరువాత మూడవది యీ amendments, resolutions ఏ రూపకముగా వచ్చినా అవన్ని చేర్చి రెండు మూడు resolutions గా చేయాలి. ఎక్కువ సంఖ్యగా వస్తే యీ resolution ఒక విధంగా చేసి తక్కినవన్నీ తీసివేయు డానికి ప్రయత్నము చేస్తున్నారేమోనని సందేహముంటే దానికికూడ అటు వంటిదేమి లేదని Leader of the House సమాధానములోనే వున్నది. ఐతే రాజధాని సమస్య విషయమే ఒకటిగా చేసి, మిగిలిన amendments మరల రావటానికి వీలులేదు. Non-official day కాబట్టి వేరే సమస్యలు రాకూడదు. ఒక కాపిటలు విషయము మాత్రము సోమవారమునాడు non-official resolution గా తేబడి చర్చ జరుపబడుతుంది. ఇంకను అవసరమైతే మంగళవారముకూడ వుపయోగించుకోవటానికి అభ్యంతర ముండదు. ఈ మూడు సందేహాలు మీకు నివృత్తి అయినవని నేను అనుకుంటున్నాను.

Sri T. Nagi Reddi :—అధ్యక్షులవారు మూడువిషయాలు క్రోడీ కరించి చెప్పారు. ఇప్పుడు మనము తీసుకునేటటువంటి తీర్మానం విషయ ములో తొలిసారిగా వచ్చేటటువంటి తీర్మానాలు ఏవి? వాటి పద్ధతి యేమిటి? లేక ఒక పద్ధతి యేమైన వున్నదా ? "That this House takes into consideration ......" అని ఒక తీర్మానము ప్రభుత్వం ప్రవేశ పెడితే

ఆ తర్వాత amendments చర్చలు జరుప వచ్చు. Education policy మద్రాసు అసెంబ్లీలో చర్చకు వచ్చినప్పుడు ఈ పద్ధతి అమలు జరుప బడింది. తరువాత సభ్యుల సవరణలు చర్చలు జరిపించుకోవచ్చు. యే పద్ధతిలో యీ చర్చలు జరుగతవి అనే విషయములో ప్రభుత్వము యొక్క అభిప్రాయ మేదో తెలియచెప్పితే మంచిది. సోమవారము నాటికి పూర్తియైతే సరి, లేకపోతే మంగళవారము నాటికికూడ పూర్తి కావలసివస్తే అది పూర్తిగాకముందు యింకొక కార్యక్రమము తీసుకోవడానికి వీలులేదని చెప్పడానికి యేమైనా ఆక్షేపణ వుందా?

మూడవ విషయం. అధ్యక్షుల వారికి ప్రత్యేకంగాచెప్పే విషయం ఏమిటంటే యిప్పుడు కొన్ని amendments ఉన్నవి. అవి మా పార్టీకి సంబంధించినంతవరకు withdraw చేసుకోమని చెప్పడానికి నాకు అధికార మున్నది. అదేవిధముగా తదితర సభ్యుల తీర్మానాలుగూడ withdraw చేస్తారా? లేక అది చేయకుండా దాన్ని ఓటుకు పెట్టినపుడు, సోషలిస్టు పార్టీ సభ్యుడు శ్రీ వెంకటసుబ్బారెడ్డిగారు చెప్పినట్లు ఆ తర్వాత చర్చకు వీలులేదనే రూల్సు యేమైనా వున్నవా? లేవా? నాకు తెలియవు. అటువంటివి లేకపోతే నేను చెప్పిన పద్ధతిలో దీనికి మా అంగీకారమేనని మేము సిద్ధమేననే విషయము చెప్పుతున్నాను.

**Sri P. V. R. Gajapathi Raju:**—Mr. Speaker, Sir. So far as our party is concerned, I would like to make it clear that the vote on the capital issue need or need not be taken by the Government as a vote of confidence. But when a matter is put forward either as an amendment to the Governor's speech or as a separate resolution, any defeat sustained is a defeat to the Government. As far as I can understand, once an amendment is moved to the Governor's Address and the Government sustains a defeat today or if the Government puts forward another proposition on Monday and is lost, the Government should treat both the defeats in the same way. On the other hand, the Government, whether it loses today or loses on Monday, on whatever proposition it may be, has gone back on the position it took up yesterday in suggesting the capital in one of the three places. Obviously, these negotiations are not yet complete.

28th November 1953] [Sri P. V. R. Gajapathi Raju]

As far as I and my party are concerned, we are not a party to those negotiations and will not be a party to those negotiations. If the Communist Party is afraid that if our amendment is lost today, it will not be in a position to move the resolution on the capital being taken to Vijayawada, if one is moved on Monday, I can assure them here and now that this Government is going to consistently thwart any proposition put forward by the Opposition. Today they may be saying that a vote against the Governor's Address is a vote of no-confidence in the Ministry and tomorrow they will say that a non-official resolution is not binding on them, and it is merely recommendatory. Therefore, if the Communist Party is really and genuinely desirous of fixing a capital for this State and the Treasury Benches are genuinely keen on this mattter, the matter must be decided today. The Government may treat it as a vote of no-confidence or not, I am not anxious that they should vacate their seats. If they are not anxious in maintaining the democratic system in this country, they are welcome to do it. I know many people are not interested in maintaining and furthering the democratic system in this country. Under one garb, people accuse the other party and the other party accuses this party and they are demonstrating it today to the hilt. Therefore there is nothing to achieve by the negotiations that are going across the Table there. The Socialist Party will definitely put forward the view that we will stand by the amendments of which we have given notice and will not be a party to the subversion of the democratic principle.

11-20 a.m.

Mr. Speaker:—ఇప్పుడు leader గారు చెప్పారు. తరువాత Leader of the Opposition కూడా చెప్పారు. ఈ మూడు కండిషన్‌లు షరతులూ నేను ఇదివరకే చెప్పాను. దాని మీద వారి assurance నా assurance ఇస్తూ ఉన్నాం. సోమవారం non-official day capital issue రైజు చేయడానికి; ఇప్పుడున్న ఎమెండుమెంట్లు తీర్మాన రూపంగా తీసుకోనవసరం లేదు. తీర్మానాలు move చేయడానికి ముందు 15 రోజుల నోటీసు అక్కరలేదని ఈ మూడు conditions ఒప్పుకున్నాం.

The Hon. Sri T. Viswanatham :—Will these things be put in the shape of Resolutions? The language should be put in the shape of Resolutions.

Tne Hon. Sri N. Sanjeeva Reddi:—Naturally when they give notice of resolutions, they will reshape these amendments.

Sri T. Potha Raju:—ఇదివఱకు జరిగిన విషయాలను బట్టి అనుమానం ఉన్నది. అది స్పష్టపరిస్తే తీరిపోతుంది.

Sri R. Lakshminarasimham Dora :—We have been hearing that any new matter or anything which is not contained in these amendments will not be accepted tomorrow and that we should refer only to the amendment now before the House in the resolutions that are coming up on Monday. That means we will be deprived of our right to move non-official resolutions on other matters.

Sri T. Potha Raju:—ఇది అధికార తీర్మానమా, అనధికార తీర్మానమా అనే question వచ్చింది. నేను మనవి చేయదలచు కున్నది ఏమిటంటే అధికార తీర్మానం, అనధికార తీర్మానం అనేటటువంటి సమస్య అల్లా ఉండనివ్వండి. ఇప్పుడు ఆంధ్ర దేశంలో ప్రధానంగా కావలసినటువంటిది తీర్మానం ఏరూపంలో తీసుకున్నా ఈ capital issue తేలాలని కోరు తున్నారు. ప్రభుత్వపక్షం ఒప్పుకున్నారు. విజయనగరం రాజాగారు ఒక అనుమానం వెలిబుచ్చారు. అట్టి అనుమానం మాకూ ఉన్నది. గత అనుభవాన్ని బట్టి ప్రభుత్వ తీర్మానం సవరణ నెగ్గితేనే, లేకపోతే అమలుపరచ నవసరం లేదని చెప్పారు. Non-official day న move చేసిన మోషన్ నెగ్గినట్లయితే అది అమలు పఱచుటకు మేము సిద్ధంగా ఉన్నామని హామీ ఇవ్వాలి. ఇది moral binding. Capital విషయంలో అన్ని పక్షాలూ చేసిన తీర్మానం అమలు జరుపుటకు సిద్ధంగా ఉన్నామని హామీ ప్రభుత్వం దగ్గరనుంచి వస్తే ఈ సమస్య పరిష్కార మవుతుంది. అల్లాంటి హామీ ప్రభుత్వ పక్షంనుంచి ఇవ్వాలని కోరుతున్నాను.

28th November 1953]

The Hon. Sri N. Sanjeeva Reddi:—క్రొత్త విషయాలు ఏమీ అడగలేదు. ఈ amendment లు తీర్మానాలుగా తీసుకొనదలచుకోలేదు. క్రొత్త తీర్మానం వస్తే సంపూర్ణమైన స్వేచ్ఛ ఇస్తాము అని పెట్టుకుందాం. మేము ఇచ్చేది పట్టుకొని మిగిలినవి అడుగుటకు వీలులేదు. వారి తీర్మానం అందరికీ సమానమైన అవకాశాలు ఇవ్వమని కోరుచున్నారు. ఎవరికీ ఉన్న హక్కులు తీసివేయడం కాదు. అలాంటి వారికి క్రొత్తహక్కులు ఇచ్చి, అవకాశం కల్పించాలి. తీర్మానం రెండు పార్టీల సభ్యులు క్రొత్త తీర్మానం ఇచ్చుకుంటారు. చట్టమూ క్లాజులూ వ్రాసి పెట్టుకొని, ఏ తీర్మాన ఫలితం ఏమవుతుందో వ్రాసిపెట్టుకున్నారు. వ్యాఖ్యానం నేను చెయ్యక్కర్లేదు. ఎసెంబ్లీ చట్టాలు ముందు వ్రాసిపెట్టాయికాని, గవర్నమెంటు ఇవ్వడం లేదు. That question does not arise.

Mr. Speaker:—సంజీవరెడ్డిగారు చెప్పేదాన్నిబట్టి resolution ఈ పార్టీల మెంబర్లుకూడా capital ని గురించి ఇవ్వడం లేక ......

The Hon. Sri N. Sanjeeva Reddi:—నిస్సందేహంగా capital ని గురించే.

Sri T. Nagi Reddi:—ఇక్కడ అడిగిన ప్రశ్నకు ఉప ముఖ్యమంత్రి గారు ఇచ్చిన జవాబును గురించి ఆలోచించాను. వ్రాశాను. విషయం అది వారికే వదలి పెడతాం. అప్పుడు ప్రతివారూ ఎదోవిధంగా సూటిగా చెప్పడానికి వీలులేకుండా చెప్పే ప్రభుత్వానికి నేను ప్రత్యేకంగా చెప్పవలసిం దేమీలేదు. నేను చెప్పిన సమాధానం అరగంట ముందు చెప్పాను. ఏదోవిధంగా తప్పించుకోవాలని, తీర్మానం రూల్సు అనిచెప్పి తనకు బాధ్యత లేకుండా చేసుకోవాలని, ఈ బాధ్యత తమనెత్తిమీద పడకుండా చేసుకోవాలని చేసిన తీర్మానమే ఉప ముఖ్యమంత్రి ఇచ్చిన సూటియైన జవాబు. దానికి ప్రత్యేక నిదర్శనమక్కర్లేదని భావిస్తున్నాను. మన అందరకూ ఒక విషయం ప్రత్యేకంగా చెప్పారు. వారి నాయకులూ ప్రభుత్వ అధినేతలూ అక్కడ ఢిల్లీలో ఉన్నారు. వారిచ్చిన సందేశం, మీరు ఈ ఆంధ్ర శాసన సభలో తేల్చుకొనుటకు అవకాశం ఇస్తాం, ఆ అవకాశం తీసివేయుము అని నెహ్రూగారు, కట్జూగారూ చెప్పి 5 రోజులయింది. ఈసంగతి తేల్చకుండా

ఈ అల్లరి తెచ్చి పెట్టారు. ఏదో పెట్టారుగదా సుహృద్భావంతో సమగ్రంగా చర్చించి నిర్ణయిస్తామంటే వారికి యిబ్బంది వచ్చింది.

[The Hon. Sri N. Sanjeeva Reddi:—ఇబ్బంది మాకు ఏమీరాలేదు.]

వారిని బైటపడవేస్తాము, మాకు ఏమీ ఇబ్బందిలేదు. సుహృద్భావంతో మెలగుదామని తీర్మానం చేస్తే, ప్రభుత్వం ఆచరణలో పెడుతుందా. ఇది క్రొత్తగా నేను చెప్పవలసిన పనిలేదు. ఇన్ని రోజులనుంచి ఇచ్చిన హామీలను పురస్కరించుకుని, ఇన్నిరోజులు ఆంధ్రజాతి ఎదురు చూస్తూ ఉన్న సంగతి ఈ విధానం సక్రమమైనది కాదని మనవి చేస్తున్నాను. ఏదో విధంగా bamboozlement ఉపయోగిస్తూ వచ్చారు. ఆ తీర్మానం ప్రభుత్వ పార్టీకి న్యాయంగా ఇవ్వతగిన సమాధానం కాదు అని ప్రతిపక్షం నుంచి చెప్పదలచుకున్నాను. రేపు ఇక్కడ ఉన్న ఎసెంబ్లీ సభ్యులు చూస్తారుకాబట్టి దాన్నిగురించి ప్రత్యేకంగా చెప్పదలచుకోలేదు. Democratic principles కీ sentiments కీ వదలి పెడతాం. ఈ తీర్మానాలకు నా అభ్యంతరం లేదు. సంజీవరెడ్డిగారు ఎల్లుండి వఱకూ ఆలోచించుకుని, అంతవరకూ ఈ సమాధానం ఇవ్వవద్దని చెప్పదలచుకున్నాను.

11-30 a.m. The Hon. Sri T. Prakasam:—అధ్యక్షా, మనం వృధాగా time తీసుకొంటున్నాం. నాగిరెడ్డిగారు ఏవిషయం వచ్చినా దానిమీద స్వంత comments అవీ, అన్నీ తూ చా తప్పకుండా చెబుతుంటారు. ఏదో వృద్ధ శంతో ఇది అంతా చెబుతున్నాను అంటున్నారు. ఇవన్నీ లేకుండా వుండడానికే మొట్టమొదట స్పష్టంగా చెప్పాను. Non-official day అంటే అందరికీ తెలుసు. ఆ నాడువచ్చే సంగతులు అందరికి తెలుసును. దాని ప్రకారం మనం ఆనాడు చేసుకోడం నా అభిప్రాయం, కాని వూరికే ప్రశ్నలు వేసుకొని చర్చ చేసుకోవలసిన అవసరంలేదు. అందుచేత వారికి ఏమీ సందేహం వుండనవసరం లేదు. సంజీవరెడ్డిగారు ఏదో చెప్పారంటే ఆయన చెప్పింది ఆనాడు ఇప్పుడు amendments ఇవ్వనివారు కూడా ఏమైనా చెప్పుకోదలిస్తే చెప్పుకోవచ్చునని. చెప్పుకోదలిచినవారు సరిగా చెప్పుకోనేలవకాశం కల్పించడానికి తమరు ఇక్కడ Speaker గా ఏర్పడి

28th November 1953] [The Hon. Sri T. Prakasam]

వున్నారు. దీనిమీద ఏవో వ్యాఖ్యానాలు చేసి రభస చేయవలసిన అవసరంలేదని మనవి చేస్తున్నాను.

Sri P. V. R. Gajapathi Raju :—I am rather sorry for the Communist Party.

Mr. Speaker :—ఇప్పుడు అనుకున్న విషయాలు తేలిపోయినాయి. Statement Leader of the House ఇచ్చారు. Leader of the Opposition ఏవో doubts express చేశారు. నేను ఆ points అన్నీ చెప్పాను. మళ్లీ ఒకసారి చెబుతున్నాను. Monday ప్రత్యేకంగా non-official day గా పెట్టుకున్నాం. ఆ రోజున రాజధాని సమస్యకు సంబంధించిన amendments resolution రూపంగా మార్చి చర్చకు తీసుకు రావడం జరుగుతుంది. మరి ఏ ఇతర amendments చర్చకు రావడానికి వీలులేదు. ఈ amendments ను resolutions రూపంలోకి మార్చి 4, 5 గంటల్లోపుగా ఆఫీసులో hand over చేయవలసిందిగా కోరుతున్నాను. ఎవరైనా రాజధాని విషయం ప్రస్తావించదలుచుకుంటే, ఇప్పుడు amendments ఇవ్వకపోయినా, subject ఒకటే కాబట్టి ఇవ్వవచ్చును. పాసుచేసిన తీర్మానం అమల్లో పెడతారా, లేదా అనే విషయంలో హామీ ఇవ్వాలి అని Leader of the Opposition అంటే దానికి Deputy Leader of the House, non-official day నాటి pass అయిన తీర్మానాలను అమలుపరిచే విషయంలో ఒక పద్ధతి వున్నది, దాన్ని అనుసరించి ఆలోచించబడుతుందని చెప్పినారు. మనం ఇక్కడ pass చేసిన resolutions అమలుపరిచే ఉద్దేశంతోనే pass చేస్తాము కాని మరొకటి కాదు. ఆ విధంగా అమలుపరచరు అనే సందేహం అవసరంలేదని చెబుతున్నాను. చాలామంది సభ్యులు మాట్లాడారు. ఇపుడు జరిగినదాన్ని బట్టి amendments ఉపసంహరించుకొన్నట్లుగా భావించమంటారా అని అడుగుతున్నాను.

**Sri T. Nagi Reddi:—Communist Party** కి సంబంధించినంత వరకు మీరు ఆ విధంగా తీసుకోవచ్చునని చెబుతున్నాను.

Sri K. V. Ramesam:—On a point of order, Sir. I invite your attention to Rules 60 and 61 of our Rules: Rule 60 says:

"A motion must not raise a question substantially identical with one on which the Assembly has given a decision in the same session."

According to Rule 61:

"A member who has moved a motion or an amendment to a motion may withdraw the same with the leave of the Assembly expressed without a dissenting voice. If, at the time of putting the question on a motion to the vote of the House, the mover of the motion is absent, it shall be considered to have been withdrawn by him, unless any member of the House asks that the question on the motion be put."

The Hon. Sri T. Viswanatham: When there is an agreement between the parties, everything will be done according to the agreement.

The question of rules does not arise.

Mr. Speaker.—రాజధానికి సంబంధించినవి ఉపసంహరించుకున్నాక ఇంకా ముఖ్యమైన సవరణలు వున్నాయా అని అడుగుతున్నాను.

Sri P. V. R. Gajapathi Raju:— We are not withdrawing our amendments; I want to make it clear again. With due respect to you, Sir, you have been accommodating so far as the non-official day is concerned. You have waived the 14 day notice period and so on. I do not want to be misunderstood, but the Government is bound to fulfil the policies arrived at in this Assembly. Mr. Sanjeeva Reddi as Deputy Chief Minister said that it was a matter of doubt, while Sri Prakasam has announced to the Communist Party.— What happens at that end of the Table we do not know.—"You need not misunderstand what Sri Sanjiva Reddi has said. Something will happen on Monday or Tuesday". But nothing definite has been said. Therefore, what I would say is that the question has to be

28th November 1953] [Sri P. V. R. Gajapathi Raju]

debated today. It is for you to decide the issue. They have already quoted some rulings, and it is within your power to give a few more rulings and I hope that these new rulings will be incorporated into the procedure of this House. The other day when you occupied the chair, a member suggested that you should give absolutely new rulings irrespective of the past. Therefore I welcome the new rulings. These new traditions may accommodate the Government and accommodate the Opposition. But as far as we are concerned, we want to make it clear here and now, let us go by the parliamentary procedure already established. We stand by our amendments and we will not be a party to their withdrawal. We know that many things have been happening in this strange world of Kurnool. Many offers of shifting the capital are being made every moment. The fear of Governor's Rule and the fear of the effect if the Ministry is lost, are being put before the various members of this House. Whatever that may be....

Sri Pillalamarri Venkateswarlu:—విజయనగరం రాజావారు తిరిగి ఉపన్యాసం ప్రారంభించారా? రాజధాని సమస్యమీద amendments ప్రతిపాదించిన వారు ఉపసంహరించుకున్నప్పుడు, rules క్రింద కాని, point of order గా గాని మాట్లాడడానికి వీలులేదు. మనం ఇక్కడ వ్యవహారం చేసుకోడానికి ఒక procedure వుంది. ఏ procedure లేకుండా మాట్లాడడం సరియైన పద్ధతికాదు. వారు చెబుతున్న విషయం procedure లో దేని క్రిందా రాదని చెబుతున్నాను.

Mr. Speaker:—Amendments అందరు withdraw చేసుకున్నారా లేదా అనేదానిమీద మాట్లాడుతున్నారు.

Sri P. V. R. Gajapathi Raju:—I thank Mr. Venkateswarlu. I know he is now trying to affect the morale of the Opposition. It is quite true that the Communist Party wants to maintain the Congress Party in office. (Laughter)

The Hon. Sri N. Sanjeeva Reddi:—On a point of personal explanation, Sir. The world knows who is who, and where the Hon. Members' party stands.

Sri P. V. R. Gajapathi Raju:—I see the time of the House must be taken up by others also. I accept it. We do not withdraw our amendments, Sir.

Sri N. V. Rama Rao:—మేము మా సవరణలను ఉపసంహారించుకున్నామని మా పార్టీ తరఫున చెపుతున్నాను.

11-40 a. m.

Mr. Speaker:—Order, order. There is much noise in the House. ఇప్పుడు ఏ సవరణలు withdraw చేసుకోపోయినప్పటికీ ఆ సవరణలు vote కు పెట్టవలసియుంటుంది. ఇప్పటికే కొంతమంది మాట్లాడారు. ఇప్పుడిప్పుడు కొన్ని amendments withdraw చేసుకుంటూ వున్నారు. శ్రీ విజయనగరం రాజాగారు తమ amendment withdraw చేసుకోవడంలేదు. Discussion కు ఎవరైనా speaker వుంటే ఒక అరగంట time యివ్వదలచుకున్నాను.

Sri V. Chidanandam:—నా మిత్రుల సలహామీద నేను మాట్లాడకుండా విరమించుకుంటున్నాను.

Mr. Speaker:—ఏమండీ సభ్యులకు ఒక మనవి చేయదలచుకున్నాను. Visitors gallery లో నుంచి చాలా శబ్దం వస్తున్నది. Members వ్యక్తిగత సిఫార్సు బట్టి permissions ఇచ్చాం. ఎందుకు permit యిచ్చామా అని విచారపడేటట్లు గొడవచేస్తున్నారు. ఇప్పుడు మరొకసారి మనవిచేస్తున్నాను. గొడవ చేయకండి, మరొకసారిచేస్తే బయటికి వెళ్లండి అని చెప్పవలసివస్తుంది. మిమ్ములను బాధపెట్టవలసివస్తుంది.

Sri M. Narayanasamy:— అయితే బయట loud speakers పెట్టించండి.

Mr. Speaker:—That may be considered. If there are Hon. Members who want to support the amendment of the Raja of Vizianagram, I request them to send their names in advance, so that I may call them one by one to speak.

28th November 1953]

(Sri P. V. R. Gajapathi Raju rose to speak)

Mr. Speaker:—I think the Rajah of Vizianagram had already more than one chance, and I do not think I can permit him any more chance to speak. Under the rules a member who had had a chance to speak once on a subject should not speak again. So, I would like the Hon. Member to allow other members to speak.

Sri Vavilala Gopala Krishnayya:—అధ్యక్షా, నా సవరణలు నేను ఉపసంహరించుకుంటున్నాను (నవ్వు).

Mr. Speaker:—ఉపసంహరించుకోవడం question కాదండి. శ్రీ విజయనగరం రాజాగారు ఉపసంహరించుకోలేదు. దానిమీద ఎవరైనా మాట్లాడాలంటే అరగంట time యిస్తానని చెప్పాను. లేకపోతే close చేసి voting కు పెడతాను.

Sri. Vavilala Gopala Krishnayya:—అధ్యక్షా, నాదొక చిన్న మనవి. నిన్న జరిగిన దురదృష్ట సంఘటన గురించి ఒక చిన్న సవరణ చెప్పాలి. అదేమిటంటే నేను శ్రీ రాజగోపాలరావుగారి car చూశానన్నాను. అంతకంటే వేరేమీ చెప్ప మరచినందువల్ల వారు నన్ను రక్షించలేదేమో అన్న misunderstanding కు అవకాశం వున్నది. అసలు సంగతి ఏమిటంటే వారు కారు ఆపి నన్ను కారులో తీసుకుపోయి రక్షించారు. ఇదే నా సవరణ అని మనవిచేస్తున్నాను.

Sri P. V. R. Gajapathi Raju:—Mr. Speaker, Sir, you have asked me not to speak again. There is only one point I would like to say, so that the House may know it. It is not about my amendment. As far as I know the constitutional position...

Mr. Speaker:—Order, Order. I want to know what the Hon. Member wants to speak about now.

Sri. P. V. R. Gajapathi Raju:—Unless you listen to me, Sir, how can you know. I know there is a time factor to my expression of views.

[28th November 1953

Mr. Speaker:—The Hon. Member will please resume his seat.

Amendment allow చేసిన తరువాత సభ్యులు ఏదైనా మాట్లాడాలంటే point of order raise చేసి మాట్లాడాలి. ఇదివరకు శ్రీ రాజా గారు 30 నిముషాలు మాట్లాడారు. ఇంకా వారు మాట్లాడాలి అనడం సమంజసముగా లేదు. ఎవరైనా మాట్లాడాలంటే పేర్లివ్వండి. Speaker కు 10, 15 నిముషాలు చొప్పున time ఇస్తాను.

## II. POINT OF ORDER RE: RULES OF PROCEDURE

Sri P. V. R. Gajapathi Raju:—I rise on a point of order, Sir, and I want you to give your ruling on it. As far as I understand constitutional matters, the rules of procedure once framed for the conduct of business in the House by the legislators cannot be changed without such rules being brought before the House on a motion for the amendment of those rules. Then the House duly constitutes a committee to go into the matter, into the necessity for the change of such rules of procedure. That is my understanding of the constitutional position. So, the rules made by you to-day changing the procedure cannot be acceptable, unless a duly constituted committee of this House is set up, it goes into it and recommends the changes for the House, and this House in its turn adopts them. Sir, I want your ruling on this matter.

Sri K. Krishna Rao:—Sir, may I submit, that these rules are made under clause (2) of Article 208 of the Constitution of India. These rules can be amended by the Speaker. These rules need not go to the Assembly for their amendment. The Speaker can alter them at his will and pleasure without any legislative sanction. There is another provision for the total amendment of the rules by the House. That is something different. Those rules, the Speaker cannot amend. Till those rules are made, the present rules will be in vogue and the present procedure also will be in vogue. I fear the Hon. Member, the Rajah of Vizianagram, is speaking without a clear knowledge of the existing rules.

Sri P. V. R. Gajapathi Raju:—On a point of order, Sir.

28th November 1953]

Mr. Speaker:—How many points of order ? (Laughter) Let me answer the points raised by the Hon. Member. The doubt expressed by the Hon. Member does not arise at this stage. Because I am allowing discussion on the amendments and we are continuing yesterday's debate, and when it comes to the question of votes being taken I will give my ruling. As regards the rule pointed out by the Hon. Member, Sri Ramesam, I feel it is the same thing which is contained in the doubt raised by the Rajah of Vizianagram. I will answer that at the time when vote is taken.

Sri P. V. R. Gajapathi Raju:—You mean the vote will be taken to-day? Or, will it be taken day after to-morrow?

Mr. Speaker:—I will do it soon after this discussion is closed; it will be taken to-day itself.

Sri P. V. R. Gajapathi Raju:—May I say this; As this is a matter of constitutional importance, your ruling will determine to a large extent not merely the future policy of this Government. So I am making this point of order, and I would like you to give a definite ruling; it is important, for on it depends whether Government will ultimately push through their policy or not. So, your ruling maintains the integrity of the House and the right of the members to force the policy of Government, (which Government do not propose to do.) In the alternative, if there is total support for Government policy, such policy should always be carried through. Therefore, it is vital to the legality of the procedure we are now having and to the legality of the vote that is proposed to be taken on Monday. After all, to-day is a day of total compromises and postponement of decisions. (Laughter) Therefore, I would request you to give your ruling here and now.

Mr. Speaker:—I quite understand the objection taken by the Hon. Member. It only arises when votes are being taken. So, I will answer that at that time. I shall now call upon hon. Members who want to support the amendments to speak. I have received several names. Mr. C. Subbarayudu will now speak.

[28th November 1953

## III. DISCUSSION ON THE GOVERNOR'S ADDRESS—CONTD.

**Sri Ch. Subbarayudu:**—అధ్యక్షా! గత రెండు రోజులనుంచి ఈ సభలో చాలా సవరణలుగురించి అందులో ముఖ్యంగా రాజధాని సవరణగురించి చాలా చర్చలు జరిగాయి, వాదోపవాదాలు జరిగాయి. చివరకు మూడవరోజు వచ్చేటప్పటికి ఈ సమస్యనుగురించి ఈ సవరణలు ఇచ్చినటువంటి మిత్రులు చాలామటుకు వాటిని ఉపసంహరించుకోడం ఆ తరువాత సోమవారం అనధికారదినం కేటాయించడం జరిగాయి. కాబట్టి ఇవన్నీ చూస్తే నాకుమాత్రం చాలా బాధకరంగా ఉంది. ఇది కొన్ని రాజకీయ పార్టీలవల్ల ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత రాజధాని విషయంలో తిరిగి నిర్ణయం చేయకపోతే ఘోరమైనటువంటి ప్రమాదం సంభవిస్తుందని చెప్పి ఆ విధంగా వారు భావించి ఈ రెండు రోజులనుంచి వారు సవరణలు పంపించడం జరిగింది. తిరిగి దాన్ని సోమవారానికి వాయిదా వేయడం ప్రజల్లో విశ్వాసం ఉన్నటువంటి ప్రభుత్వంకాదని అటువంటి ప్రభుత్వం ఉండడానికి వీలులేదని నేను చెప్పుతున్నాను. ఈ సమస్యపై ప్రభుత్వం ఉండడమో లేకపోతే పోవడమో నిర్ణయించుకోడం మంచిది. అంత ప్రధానమైన సమస్య అయినప్పుడు జీవన్మరణ సమస్య అయినప్పుడు, సోమవారానికి వాయిదావేయడం అది ఘోరమైనటువంటి అపచారం కాదా? నాలుగు రోజులుగా ఈ చర్చలన్నీ జరుపుతూ ఈ బాధలన్నీ పడుతున్నా కొంచెంకూడా ఇంగితజ్ఞానం లేకపోతే మనం ఎందుకు శాసనసభ్యులమని చెప్పుకోనేది?

**Sri K. Krishna Rao:—On a point of order, Sir.** ఇంగితజ్ఞానం లేనటువంటి సభ్యులు ఇక్కడ ఉన్నారా? అటువంటివారిలో వీరుకూడా ఒకరా? కాబట్టి ఆ విషయాన్ని వారు ఉపసంహరించుకోవలసిందిగా కోరుతున్నాను. లేకపోతే దీన్ని ప్రివిలేజెస్ కమిటీకి రెఫర్ చేయవలసి ఉంటుందని కోరుతున్నాను.

**Mr. Speaker:**—నేను అసలు వారికి అవకాశం ఇచ్చింది amendment మీద ఏమైనా మాట్లాడుతారని. అది పోయి వారేదో వేరే విషయంమీద మాట్లాడుతున్నారు. అసలు నేనే call చేద్దామనుకున్నాను.

28th November 1953] [Mr. Speaker]

అయినా గౌరవనీయులైన సభ్యులు దాన్ని ఉపసంహరించుకుంటారని అనుకుంటున్నాను.

Sri C. Subbarayudu.— దాన్ని నేను ఉపసంహరించుకొంటు న్నాను. ఈనాడు మనం ఎందుకు ఈ చర్చలన్నీకూడా ప్రధానంగా తీసు కొచ్చాం? ఈ విషయంలో నేను ముఖ్యంగా 4 రోజులనుంచికూడా ఈ సమస్యను తీసుకురావలసిన అవసరంలేదనికూడా చెప్పిఉన్నాను. అంటే నేను గుంటూరు-విజయవాడ రెండిటిమధ్య పెట్టాలని, అది శాశ్వత రాజ ధాని అని చెప్పి ప్రతిపాదనలు అన్నికూడా చాలా ఉన్నాయి. అయితే ఇవన్నీ మార్చడానికి ఏ 5, 6 నెలలో తప్ప లేదని అందరకు తెలుసు. 12-00 noon

శాశ్వత రాజధాని అనేటువంటి సమస్యపైన చర్చ వచ్చినపుడు, విశాలాంధ్ర కావాలని దానిని సాధించాలని మన మెంతో చర్చ చేస్తూ వచ్చాము. దానికి మన మిత్రులు ఎట్టి ఎట్టి నినాదాలు చేస్తూ వచ్చారు. వారికి యేది శాశ్వత, యేది అశాశ్వత అనేటువంటిదికూడ అర్థంకాకుండా వుంది. నేను, శ్రీ సుబ్బారెడ్డిగారు చెప్పినట్లుగా, మనంతట మనం శాశ్వత రాజధానిని తక్షణం సాధ్యమైనంత త్వరలో యేర్పాటు చేసుకోవాలనే వుద్దేశ్యము కలిగినవాడను. ఇంతవరకు కర్నూలును రాజధానిగా పెట్టుకో వడమనేది ప్రజలకు యెంతవరకు క్షేమకరమూ అనేది ఆలోచించవలసినదని జ్ఞాపకము చేస్తున్నాను. గత 40 సంవత్సరాలుగా మనం స్వరాష్ట్రసిద్ధికై పోరాటం జరుపుతూ వచ్చాము. రాయలసీమవారికి, సర్కారువారికి జరిగిన శ్రీబాగ్ ఒడంబడికను అమలుజరుపుదురా యనే సందేహం తీర్చుటకొరకే కర్నూలులో రాజధానిని పెట్టుకున్నారు. ఆ శ్రీబాగ్ ఒడంబడికను నిన్న మొన్నటివరకు అమలుపర్చలేని సమస్య వచ్చినపుడు వారి కా సందేహ నివృత్తిచేసి, వారికి నచ్చజెప్పాము. అయితే ప్రప్రథమముగా మద్రాసు శాసనసభలో యీ రాజధానీ సమస్య వచ్చినప్పుడు, అందరూ కర్నూలు రాజధానిగా నిశ్చయించారు. కర్నూలులో రాజధానిపెట్టి మూడు మాసాలుకూడ కాలేదు. మూడు మాసాలు కాకపూర్వమే యీలాగున చెప్పి మార్చడంలో మనందరి మధ్య ప్రజలమధ్య భేదాభిప్రాయాలు వస్తు న్నాయి. ఆలాగు మార్చండి అనడంలో అపవిత్రతయు, అసమానము కనిపి స్తున్నవి. పెద్దల సహాకారంతో చేసుకొనిన శ్రీబాగ్ ఒడంబడికను అమలు పరచి, రాజధానిని రాయలసీమలో పెట్టుకొనుటకు నిశ్చయించుకొన్న

[Sri Ch. Subbarayudu] [28th November 1953

పెద్దలే, తిరిగి ఒకటిన్నరనెలలు కాకపూర్వమే యిచ్చటినుండి తరలించ దలచడం నాకు చాల బాధకరంగా వున్నది. అటువంటిది యీ ప్రప్రథమ సమావేశంలో దీన్ని యింతగా చర్చించి, నిర్ణయముచేసిన రాజధానిని యిచ్చటనుండి కదల్చడానికి ప్రతిపక్ష సభ్యులు యింత పట్టుదల కనపర్చడం చాల శోచనీయము. ఇదంతా దేనికోసము? శ్రీ సుబ్బారెడ్డిగారు చెప్పినట్లు శ్రీ విజయనగరం రాజాగారు చెప్పినట్లు యిటువంటి urgent సమస్యను, ప్రభుత్వం వుంటుందో, వూడుతుందో తెలుసుకోకుండా యీనాడు ప్రభుత్వం నిలబెట్టుకొనడానికి ప్రతిపక్షసభ్యులు ప్రయత్నించడంలేదు. ఇది ప్రజా ప్రభుత్వంకాదు అని ఒక వైపున వారు చెప్పుతూంటే, యీనాడు కూడ వారికి అవకాశం యిచ్చినవారము కాదా? ఈ అవకాశమును వారెందుకు పురస్కరించుకోకూడదు? అదేమిటంటే, తిరిగి election లో నా పార్టీ బలపరచుకొనడం ఎట్లా అని. ప్రజలలో యిది మొట్టమొదటి అవకాశంగా తీసుకొని ప్రయత్నం చేస్తూండడము తప్ప వేరే యే అభిప్రాయంకాదని నేను చెప్పుతున్నాను. దయచేసి యీ విషయము ఆలోచించండి. ఈనాడు ఆంధ్రదేశంలోవుండే పరిస్థితులనుబట్టి సమస్యలు చాలా వున్నవి. అంతకంటె ప్రధానమైన సమస్యలు అనేక మున్నవి. వాటిని గురించి మనము నిష్కామబుద్ధికంగా పరిష్కరించుకోవలసిన బాధ్యత మనపై వున్నది. మనల నందరిని ప్రతినిధులుగా పంపినందులకు దీనిపై మనం యింతగా వాదోపవాదాలు పెట్టుకొని, లేనిపోని అనుమానాలు కలిగేటట్లు చేసుకొనినట్లైతే మనం మనలను ప్రతినిధులుగా యెన్నుకొన్న ప్రజానీకానికి తీరని అపచారం చేస్తున్నామని నేను బాధపడుచున్నాను. ఈ సమస్యపైన గౌరవ సభ్యులందరి సహకారము, ఐక్యత పొంద ప్రయత్నించమని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పటికైనా యీ భేదాభిప్రాయములు మాని, నిజంగా మనం పవిత్ర హృదయముతో విశాలాంధ్ర సాధించుకోవాలనే వుద్దేశ్య మున్నట్లైతే, యిక్కడ ఉండేవారికి నమ్మకము కలుగజేసినయెడల అది వుత్తమ లక్షణం, ఉత్తమ ధర్మము అనుపించుకొంటుంది. అది మన విద్యుక్త ధర్మము, కాని, అన్నిటికికూడ విభేదాలు కలుగజేయడానికి ఒకరు, గుంటూరు-విజయవాడ అని, యింకొకరు విశాఖపట్నం అని అంటూంటే, దాని విషయంలో నిన్న ముఖ్యమంత్రి ఒక statement కూడ యిచ్చారు. మూడు సంవత్సరములు గడచిన తరు

వాత విశాఖపట్నంకూడ యేలాగునైనా మార్చుకోవచ్చునని ముఖ్య మంత్రి చెప్పారు. నాకుమాత్రం అర్థం కావడంలేదు. ఆంధ్ర ప్రభుత్వము సాగించే పద్ధతి అందరు ఆమోదించే వుంటారు. ఆనాడు శ్రీబాగ్ ఒడంబడిక ప్రకారము తాత్కాలిక రాజధానిని కర్నూలులో పెట్టడానికి ఆమోదించినవారు, యీనాడు యీ క్షణమే యిచ్చటనుండి కదిలించడానికి మన రాయలసీమ మిత్రులుగూడ యెందులకు భాగస్వాములుగా అయ్యారో నాకు అర్థం కావడంలేదు. ఇది కేవలం వారు ప్రభుత్వం నిలబెట్టుకొనడాని కోసమే, లేకపోతే శ్రీబాగ్ ఒడంబడిక అనేదాన్ని రద్దు చేస్తున్నారు. వారు దాన్ని చిత్తుకాగితంలా నిరుపయోగం చేయాలని ప్రయత్నం చేస్తున్నారు. లేనియెడల, ఆ శ్రీబాగ్ ఒడంబడిక అనేదాన్ని రద్దుచేయాలన్నట్లుగా మాట్లాడడము, ఆ విధంగా అలక్ష్యించడము భావ్యంకాదని, అది పాతబడిపోయిందని చెప్పేవారికి మనవి చేస్తున్నారు. ఈనాడు వీరు మంత్రులుగా వుండవచ్చు. ఇవి మనకు శాశ్వతంగావు. ప్రభుత్వం యెక్కడ వుడం బోతుంది. ప్రభుత్వము నిజాయితీ అయినటువంటి ప్రాతిపదికలమీద వచ్చినట్లైతే, ప్రజలకు నిజమైన క్షేమాన్ని కలుగజేస్తుంది. ఇది మనకు ఆత్మ శాంతిగాకూడ వుంటుంది. ఇవన్ని శాశ్వతంగా వుండవచ్చు. నేను యిట్లా అన్నందులకు క్షమించాలంటున్నాను. అనుమానాలు కలిగేటట్లు చేయవద్దండి. ప్రజలకు బాధకలిగేటట్లుగా చేయవద్దని మనవి చేస్తున్నాను. నేను యీ విధంగా మీకు ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను. ఈనాడు cash తప్ప యితర తగాదాలు వున్నప్పటికికూడ, వారి భవిష్యత్తు తేల్చుకోవాలని ప్రయత్నిస్తే వారు బాధ కలుగజేస్తున్నారేకాని, యింకొకరికి అంతకన్న యెక్కువ బాధ కలుగజేయకూడదని, దానివల్ల వారి నిర్ణయము, నిజాయితీకూడ పాడౌతుంది. ఇది మీకు వినయపూర్వకముగా మనవి చేస్తున్నాను. కర్నూలు రాజధానిగా వుంచి, ఆ శ్రీబాగ్ ఒడంబడికను అమలు పరుస్తారా? ఇది moral application కాదా? విశాఖపట్నంగాని, యింకొకచోటికి గుంటూరు-విజయవాడకుగాని ఒక నిర్ణయం చేసినట్లైతే, దానికి నిజాయితీగా కట్టుబడవలసిందే. కర్నూలు రాజధాని సర్వజనాత్మకంగా శ్రీబాగ్ ఒడంబడిక ననుసరించి నిర్ణయించారు. అది మరొక place కుగాని, యింకొక place కుగాని తరలించినట్లైతే, అది అధర్మ ప్రాతిపదికలమీద సభ్యులు నడచారని అర్థమౌతుంది. అనేకమైన విభేదాలు కలుగుజేసుకోకుండా, ఖచ్చితమైన ఒక నిర్ణయానికి రావలసిందనిన్ని,

అవిశ్వాస కారణంగా పాటుపడవద్దనిన్నీ, అధర్మంగా కర్నూలునుండి రాజ ధానిని మార్చదలచినట్లైతే అప్రతిష్ట పాలౌతారనిన్నీ నేను చెప్పక తప్పదు. అందు ముఖ్యంగా రాయలసీమ ప్రజకు అపచారము, అప్రతిష్ట పాలుచేయ డానికి ఒకవేళ పూనుకొన్నట్లైతే, మీరు రాజీనామాలు (At this stage the Deputy Speaker occupied the Chair) యిచ్చి వెళ్లిపోవడం మంచిదని. అవసరమైతే అందు మూలముగా మా అసమ్మతిని తెలియ జేయుటకు సిద్ధంగా వున్నామని, తరువాత మీ యిష్టంవచ్చిన ప్రకారము చేసుకోవచ్చునని తెలియజేస్తున్నాను.

Deputy Speaker called on Sri M. V. Subba Reddi to speak.

Sri M. Venkata Subba Reddi rose to speak.

Sri M. Veerabhadram:—On a point of order, Sir. ఒకసారి ఒక సభ్యుడు మాట్లాడిన తరువాత ఆసభ్యుడు మరల మాట్లాడ వచ్చునా ?

Deputy Speaker:—ఇది సభా కార్యక్రమం గావున, నేను మాట్లాడమని అన్నాను.

Sri Pillalamarri Venkateswarlu:—అది యే rules ప్రకా రము మాట్లాడమని చెప్పారో తెలియజేస్తారా ?

Deputy Speaker:—I have already given a ruling.

* Sri M. Venkata Subba Reddi:—నేను 88, 89 నంబర్లుగల సవ రణలను ప్రతిపాదిస్తున్నాను. అవి యేమిటంటే యిక్కడకు record తెచ్చి trace చేసిన వెనుక "That the capital of Kurnool stands as it is, unless and until Visalandhra is formed with Hydrabad as capital." 89 వ సవరణ యేమిటంటే "In regard to changing of all Andhra offices which are at present located at Madras to Hyderabad, a place much nearer to Kurnool than Madras in order to economise our expenditure and ensure efficiency."

28th November 1953] [Sri M. Venkata Subba Reddi]

12-10 p.m.

ఉపాధ్యక్షా, ఈనాడు ఆంధ్రులయొక్క ముఖ్యోద్దేశం విశాలాంధ్రను సాధించి హైదరాబాదును శాశ్వత రాజధానిగా చేసుకోవలయునని యున్నది. దీనిని అన్ని రాజకీయపార్టీలు అంగీకరించవలసియున్నది. వారి పార్టీ విభేదాలు ఏమున్నప్పటికి కూడా ఆంధ్రరాష్ట్రసమస్యలో ఏకీభవింప వలసి యుంటుంది. మనకు శాశ్వత రాజధాని హైదరాబాదు ఏర్పడేంతవరకు, తాత్కాలిక రాజధానిని 14 చోట్లకు మార్చడం ఏమాత్రం సబబు కాదు. ఇప్పుడు కర్నూలును తాత్కాలిక రాజధానిగా ఏర్పాటుచేసి, 50 లక్షలు ఖర్చుపెట్టియున్నారు. ప్రభుత్వము, గవర్నరు, ప్రభుత్వోద్యోగులు, తమ శక్తి సామర్థ్యాలను ఉపయోగించి పనిచేస్తున్నారు. ఉద్యోగులకు ఇప్పటి వరకు సరియైన వసతులు ఏర్పాటు చేయబడకపోవుటవలన కొంత ఇబ్బందికి లోనైనారు. అటువంటి సందర్భంలో మరల ఇక్కడ నుంచి రాజధానిని తరలించడమంటే, వారు ఎన్ని కష్టాలకు పాలుగావలసి యుంటుందో, ప్రభుత్వము ఏ విధంగా పరిపాలనను సాగించగలదో గమనించవలసి యుంటుంది. ఈ సందర్భములో ఒకరు ఒక చోటకు పోదాము అంటే, మరొకరు ఇంకొక చోటికి, గుంటూరు, లేక విజయవాడ లేక విశాఖపట్నం, లేక నెల్లూరు లేక మరొక చోటికి ఈ విధంగా కోరితే, తుదకు ఎక్కడకు పోతామో తెలియకుండా ఉన్నది. ఈలాంటి తీర్మానాలకు గవర్నరు బద్ధులు కాదలుచుకొంటె, పండిట్ జవహర్లాల్ నెహ్రూగారికి 2 వందలు ఒంటెలు పంపించమని వ్రాస్తే బాగుంటుంది. ఎందుకంటే, ఈ గుడారాలను ఒకచోట నుంచి మరొక చోటికి, ఈవిధంగా 14 తాత్కాలిక చోట్లకు మోసుకొని పోవుటకు ఒంటెలు కావలసి యుంటుంది. మరియు మన శాసనసభయొక్క విజ్ఞానము ప్రపంచానికంతయు వెల్లడి అవుతుందని మనవి చేస్తున్నాను. అటుతరువాత, Boundary Commission ఎప్పుడు ఏర్పడుతుందో ఆ Boundary Commission నిర్ణయం వ్యతిరేకమైనట్లైతే విశాలాంధ్ర రాదుకదా అని కొంతమంది సెలవిచ్చారు. ఈ Boundary Commission రిపోర్టులు చదివి చదివి విసిగి వేసరిపోతున్నామని మనవి చేస్తున్నాను. అందుకోసం ఆ Boundary Commission ఏర్పడి, వారు రిపోర్టులో వ్రాస్తేనే విశాలాంధ్ర వస్తుంది; లేకపోతే రాదు, అన్నట్లయితే, అది మన బలహీనతను తెలియజేస్తుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వంటివారిని ఎదిరించి పోరాడి స్వరాజ్యాన్ని సంపాదించుకొన్నాము. అటువంటివారు ఈనాడు

[Sri M. Venkata Subba Reddi] [28th November 1953

Boundary Commission ఇస్తే స్వీకరిస్తాము లేకపోతే లేదు, అనుకోవడం మన బలహీనతను వెల్లడి చేస్తుందని మనవి చేస్తున్నాను. కమ్యూనిష్టులు విశాలాంధ్రను గురించి ఎంతో చెప్పుకొంటూ యుండేవారు. విశాలాంధ్ర మహా ఉత్కృష్టమైనదని, దానిని సాధించి తీరవలెనని చెప్పేవారు. అందులో ముఖ్యంగా 'విశాలాంధ్రము' అనే మహా ఉద్గ్రంధాన్ని రచించిన శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, ఈనాడు ఎందుకు ఈవిషయములో వెనుకంజవేస్తున్నారు? Boundary Commission వస్తుందో రాదో, అది వచ్చినా దీనిని సూచిస్తుందో లేదో, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారికి ఇది ఇష్టములేదని ఈవిధంగా ఎందుకు అనుకోవడం అని అడుగుచున్నాను. మన మీనాడు సాధించింది 11 జిల్లాలు, 3 తాలూకాలు మాత్రమే. ఇంకా మనం 8 తెలంగాణా జిల్లాలను సాధించవలసియున్నది. అంతవరకు మన ఉద్దేశం, మన కర్తవ్యం పూర్తికాదు. ఈనాడు 12 జిల్లాలతో గుంటూరు, విజయవాడలో రాజధానిని ఏర్పరచుకొంటే చాలును అనుకొంటే, ఇకముందు విశాలాంధ్ర ఏవిధముగా వస్తుందో ఆలోచించుకోవచ్చును. నిజంగా మనకు విశాలాంధ్రను సాధించవలెననే కోరిక, దృఢనిశ్చయము ఉంటే శ్రీబాగ్ ఒడంబడికను మన్నించి, తాత్కాలిక రాజధానిని ఇక్కడనే ఉంచి, ఆ విధముగా రాయలసీమవారిని కూడ గట్టుకొని అందరు కలిసి విశాలాంధ్రకు పోరాడితే తప్ప, అది రావడానికి వీలులేదు. ఈనాడు మన వ్యాపారము, డబ్బు అంతే, అరవప్రాంతాలకు తదితర ప్రాంతాలకు పోతున్నది. ఎందుకొరకు మన డబ్బు ఇతరప్రాంతాలకు తరలించవలెను? ఉత్తరోత్ర మనము విశాలాంధ్ర సాధించినట్లైతే, మన వ్యాపారము, డబ్బు చెలామణి అంతయు మన తెలుగు ప్రాంతాలలోనే చేసుకొనుటకు అవకాశముంటుంది. ప్రస్తుతం మన కార్యాలయాలకు మద్రాసులో ఎక్కువ అద్దె ఇచ్చుకొంటూ వున్నాము. ఆవిధముగా అంత ద్రవ్యము మద్రాసులో ఖర్చుపెట్టేదానికంటే హైదరాబాదులో మన కార్యాలయాలన్నీ పెట్టుకొనడం మంచిది. కనుక వెంటనే మద్రాసులో ఉన్న కార్యాలయాలన్నీ హైదరాబాదుకు తరలించాలని మనవిచేస్తున్నాను. ఆంధ్రరాష్ట్ర మహా సభాధ్యక్షులుగా, ఆంధ్రరాష్ట్రము గురించి మహోత్కృష్టంగా నినాదాలు చేసి ఏనుగులపై ఊరేగిన, మహానాయకులు ఈనాడు మంత్రివర్గంలోనున్నారు. ఆ ఉత్కృష్టమైన స్థాయిని నిలుపుకోవాలంటే హైదరాబాదును సాధించితీరాలి. లేకుంటే మనలనుచూచి

28th November 1953] [Sri M. Venkata Subba Reddi]

బయట ప్రజ ఏమనుకొంటుందో ఆలోచించుకోండి. లేకపోతే ఆనాడు ఏనుగులమీద ఊరేగినవారు ఇకముందు ఏనుగులమీద చేస్తారో నుకేమిటి మీద చేస్తారో ఆలోచించుకోండి.

జై విశాలాంధ్ర, ఛలో హైదరాబాద్.

Sri P. Gunnayya:—అధ్యక్షా, ఈ రాజధాని సమస్యనుగురించి మనము 2, 3 రోజులనుంచి చర్చిస్తూ యుండగా మన ఆంధ్రదేశములోనే కాదు, యావద్భారత దేశమంతటాకూడ, మన మేవిధంగా ఈ సమస్యను పరిష్కారము చేస్తామోనని, మన ఆంధ్రదేశంలో పరిపాలన ఏవిధముగా జరుగుతుందోనని ప్రజానీకము ఎదురు చూస్తూంది. అంతేగాకుండా మనకు పూజ్యులైనటువంటి భారత ప్రధాని దేశములో ఇకముందు భాషా రాష్ట్రములను విభజన చేయడానికి మన ఆంధ్రరాష్ట్రము మార్గాన్ని చూపిస్తుందని, అందుకు అనుకూలమైన మార్గములో శాసనసభ నడుస్తుందని, ఆశిస్తున్నారు. కాబట్టి మనం అతి జాగరూకతతో మన వ్యవహారాలలో ఏలాటి లోటుపాట్లు లేకుండా రాష్ట్రాభివృద్ధికి కృషి చేయవలసి యున్నది. ఇప్పుడు ఈ సభముందు రాజధాని సమస్యవచ్చినది. దాని కొరకు మరొక పూజ్యులైనటువంటి ప్రకాశంపంతులుగారు ఒక non-official day సోమవారమునాడు నిర్ణయించారు. అందుకు ప్రభుత్వాన్ని చాలాఅభినందిస్తున్నాను. ఈ రాజధాని సమస్య చాలా ముఖ్యమైనటువంటి సమస్య. రాష్ట్రములోని ప్రజలంతా ఇది ఏమవుతుందోనని ఈ చర్చ జరుగుచుండిన రెండురోజులనుండి తహతహలాడి పోతున్నారు. అందుకనే, దీనిని ప్రత్యేకంగా చర్చించి, పరిష్కరించుటకు ప్రభుత్వమువారు ఒక non-official day ను ఇచ్చేటపుడు ఇప్పుడు ఇచ్చినటువంటి సవరణలన్నీ ఉపసంహరించుకొనుట మంచిది. ఈ సందర్భమున విజయనగరం రాజాగారుకూడ దీనిని గుర్తించి, వారి సవరణను ఉపసంహరించు కోవలసిందని వారికి మనస్ఫూర్తిగా నమస్కారాలు అర్పిస్తూ ఆ విధంగా చేయవలసిందని కోరుచున్నాము.

తదుపరి మన దేశములో రాజధాని విషయమై ఇక్కడ కర్నూలులో తాత్కాలిక రాజధాని అనిచెప్పి మనము అనుకొని, యీ తాత్కాలిక రాజధానిని యిక్కడ కర్నూలులో ఏర్పాటు చేయుటకు నిర్ణయించాము.

[Sri P. Gunnayya] [28th November 1953

ఈ తాత్కాలిక రాజధానిని కర్నూలులో ఉంచుటకు ఆంధ్రదేశములోని ప్రజలకు కాని శాసనసభ్యులకుగాని ఏ విధమైన అభ్యంతరములేదు, అని చెబుతున్నాను. కాని, ఈ రాజధాని సమస్య అతి ప్రధానమైన సమస్య గనుక యీ సమస్యను మన శాసనసభలో సంపూర్ణముగా చర్చించవలసిన అవసరమున్నది. అది ఒకరోజు, రెండురోజులలో తీరేటటువంటి సమస్య కాదు. అందులో ముఖ్యంగా శాశ్వతరాజధానికి స్థలనిర్ణయం చేయాలి గనుక యీ నిర్ణయానికి సంపూర్ణమైన చర్చతో అవసరమున్నది. శాశ్వత రాజధాని విషయము రాబోవు సోమవారము చర్చించబోతున్నాము. శాశ్వత రాజధానికి తగు పట్టణము మన ఆంధ్రదేశములో విశాఖపట్టణము తప్ప మరేదియునులేదు. విశాఖపట్టణమునకు రాజధానికి తగిన సౌకర్యాలు అన్నియుకలవు. మద్రాసులో మాదిరిగా విశాఖపట్టణమునకు ఓడరేవు గలదు. ఈ రేవు స్టీమర్లుగూడా రాగలచోటు. మద్రాసులోని బీచికన్న విశాఖపట్టణములో మంచి బీచికలదు. పెక్కు భవనాలు కలవు. మద్రాసు Fort St. George కోటలో మాదిరిగా, విశాఖపట్టణములోగూడ గవర్నమెంటు ఆఫీసులు పెట్టుటకు పెద్దపెద్ద భవనములు కలవు. ప్రజలకు పెద్దదిగా గవర్నమెంటువారి హాస్పిటలు వున్నది. ఇంకను రాజధానికి అవసరమైన సౌకర్యాలు వున్నవి గనుక విశాఖపట్టణమే శాశ్వత రాజధానికి తగిన పట్టణము అని అంటున్నాను. ఈ రాజధాని తాత్కాలికంగా యిక్కడ కర్నూలులోనే వుంచి ఆ తరువాత శాశ్వతరాజధాని విషయము ఆలోచించవచ్చును. కారణమేమిటంటే మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ యిక్కడ కర్నూలులో తాత్కాలిక రాజధాని అని పేరుపెట్టి రాష్ట్రావతరణ 1-10-53 వ తేదీన జరిపారు. ఇంతకొద్ది కాలములోనే యీ రాజధానిని మరొక చోటికి తరలించడమంటే మంచిపని కాదని నానమ్మకము. ఇప్పటి కెన్నో లక్షలు ఖర్చుచేసి రాజధానిని ఏర్పరుచుకున్నాము. మరల యింకొక చోటుకు వెళ్ళాలంటే, మరల ద్రవ్యము ఖర్చుపెట్టాలి. ప్రభుత్వమువారు మాటిమాటికి డబ్బు ఖర్చుచేయాలంటే, ప్రభుత్వానికి డబ్బువుండవద్దా అని అంటున్నాను. అసలే లోటుబడ్జెటు అంటున్నారు. అదిగాకుండా మనకు విశాలాంధ్ర, హైదరాబాదు వస్తుందని ఆశపడుతున్నాము. ఆ ఆశ తీరటానికి రెండుమూడు సంవత్సరాలు పట్టుతుందని అంటున్నారు. అంతలోపుగా విశాలాంధ్ర, హైదరాబాదు రాకపోతే, అప్పుడు శాశ్వత రాజధాని ప్రసక్తి వచ్చినప్పుడు, విశాఖపట్టణములో ఏర్పాటు చేసుకోవచ్చును.

28th November 1953] [Sri P. Gunnayya]

అయితే విశాఖపట్టణము రాయలసీమకు ఆరువందలమైళ్లు దూరములో వుంటుందని కొంతమందిసభ్యులు అనవచ్చును. అట్లాగై తే, విశాఖపట్టణమునకే శ్రీకాకుళం జిల్లాలోని ఒరిస్సా సరిహద్దు ప్రదేశాలున్నూ, ఒరిస్సా రాష్ట్రములోనున్న ఆంధ్రప్రాంతాలుగూడవస్తే, ఆప్రాంతాలుగూడా విశాఖపట్టణమునకు అంతే దూరములోవుండ గలవు. గనుక రాజధాని దూరము అనే విషయము, అందరికీ వుంటుంది. ప్రజలకు సౌకర్యమైన ప్రదేశము అవునా, కాదా, వ్యాపారము వర్గాలకు సరియైన కేంద్రము అవునా కాదా అనే విషయము ఆలోచించాలని అంటున్నాను. అదియునుగాక మన ఆంధ్రదేశాన్ని పోషించేటటువంటి జిల్లాలు ఆంధ్రదేశములో నాలుగుజిల్లాలున్నవి. అలాంటి జిల్లాలు ఆంధ్రదేశంలో మరెక్కడను లేవు అంటే, బ్రిటిషువారి హయాములో కృష్ణా, గోదావరి నదులు ఆజిల్లాలగుండా ప్రవహించుటవల్ల అక్కడ డెల్టాలు ఏర్పరచబడ్డవి. ఆ డెల్టాలవల్ల ఆ నాలుగు జిల్లాలు యెక్కువ సారవంతమైన జిల్లాలు అని అనబడుచున్నవి. ఆ నాలుగు జిల్లాలలోవున్న రైతాంగము అయితేనేమి, జమీందార్లు అయితేనేమి, వర్తకులు అయితేనేమి, అచ్చట చాలామంది ధనికులు వున్నారు. ఆ ప్రదేశాలలో ఒక ఎకరమునకు రెండు గరిశెలు పండించుచున్నారు. అలాంటివి మన రాష్ట్రములో వున్న పదకొండు జిల్లాలను పోషించేటటువంటివి యీ నాలుగుజిల్లాలు వున్నవి. అంటే అవి కృష్ణా, వుభయ గోదావరులు, గుంటూరు, నెల్లూరు జిల్లాలు. అలాంటి జిల్లాలు మనరాష్ట్రములో అన్నిచోట్లను లేవుఅన్నమాట. మన ఆంధ్రదేశాన్ని అంతటను పోషించేటటువంటి జిల్లాలు అని చెప్పాతున్నాను. ఈ రాజధాని మనకు ఎక్కడవుంటే యేమికావాలి? చాల వెనుకబడినటువంటి జిల్లాలలోని ప్రజలకు అంటే మెట్టప్రాంతాలుగా వున్న చోట్లకి అవసరమైన సౌకర్యాలు ప్రభుత్వము యేర్పాటుచేయాలి. వారికి తిండికిగింజలులేకపోయినా ప్రభుత్వము యీ జిల్లాలనుంచే యివ్వాలి. అప్పుడే అది ప్రజాప్రభుత్వము అనిపించుకోగలదు. శాశ్వత రాజధాని విషయములో యీ కర్నూలునుంచి మరొకప్రదేశానికి మార్చాలని చాలమంది సభ్యులు అంటున్నారు. రాయలసీమ వారు కర్నూలులోనే వుండాలని అంటున్నారు. ఇతర పార్టీలవారు విజయవాడ - గుంటూరులకు తరలించాలని అంటున్నారు. కోస్తాజిల్లావారు విశాఖపట్టణమునకు మార్చాలంటున్నారు. ప్రభుత్వపక్ష సభ్యులు ముఖ్యంగా రాయలసీమ కాంగ్రెసు సభ్యులు యీ తాత్కాలిక రాజధానిని విశాలాంధ్ర సంగతి తేలేవరకు అనగా రెండు

[Sri P. Gunnayya] [28th November 1953

మూడేండ్లవరకు కర్నూలులోనే వుంచి అటుతరువాత శాశ్వత రాజధానికి ఏర్పాటులు చేసుకోవచ్చునని అంటున్నారు. శాశ్వత రాజధానికి యిప్పుడే మార్చే సందర్భములో అన్ని సౌకర్యాలుగల విశాఖపట్టణమునకే మార్చిన యెడల బాగుంటుంది. విశాఖపట్టణమునకు ఎటువైపు చూచినను 350 మైళ్ల వరకు ఆంధ్రప్రాంతము, అంటే అటు శ్రీకాకుళము జిల్లా, ఒరిస్సా సరిహద్దులవరకున్నూ, యిటుసర్కారు జిల్లాలలో నెల్లూరు జిల్లా వరకున్నూ ఎటుచూచినను సమానదూరంలో వుంటుంది. విశాఖపట్టణము జిల్లాలో కూడ బలిష్ఠమైన సిమెంటురోడ్లు, వంతెనలు వున్నవి. అందువల్ల ఇతర జిల్లాలతో రాకపోకల సౌకర్యములకు యిబ్బంది వుండదు. రాయలసీమ జిల్లాల వారికి తగిన సదుపాయములు ప్రభుత్వము చేయవలసివుంటుంది. గవర్నరుగారు యిచ్చిన వుపన్యాసమునకు అభినందన తీర్మానానికి తోడ్పడే టందుకు, యిప్పుడు కొంతమంది సభ్యులు యిచ్చిన, తీర్మానానికి సవరణలను withdraw చేయగలందులకు కోరుచున్నాను. ప్రభుత్వమువారు ప్రజా సౌకర్యములకు అనుగుణంగా ప్రభుత్వము యేర్పాటు చేయుదురని ఆశిస్తున్నాను.

* Sri B. Sankarayya :— అధ్యక్షా! ఆంధ్రదేశములో నలభై సంవత్సరముల బ్రహ్మాండమైన పోరాటోద్యమ ఫలితముగ యివ్వాళ ఆంధ్రరాష్ట్రము యేర్పడటము జరిగింది. యీనాడు ఆంధ్రరాష్ట్రానికి ప్రధమ వుపన్యాసము గవర్నరుగారు యిచ్చారు. ఐతే ఇవ్వాళ యీ వుపన్యాసాన్ని గవర్నరుగారు యిచ్చారు అంటే యిప్పుడు నూతనముగా ఏర్పడిన రాష్ట్రములో ఏ పంథాలో, ఏ పద్ధతిలో ఈ వుపన్యాసము యివ్వబడ్డదో, ఈవేళ గవర్నరుగారు ఈ ఉపన్యాసము యిచ్చారో తెలియలేదు. అందుచేత ఈవేళ గవర్నరు యిచ్చిన ఉపన్యాసములో నలభై సంవత్సరములుగా ఏ ఆశయముతో ఆంధ్రప్రజలు ఈ రోజు ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు చేసుకోగలిగారో, అటువంటి ఆశయాలతో ఆంధ్రదేశాభివృద్ధి చేసుకోవటానికి ఆంధ్రదేశములో వున్నటువంటి పరిస్థితులను పరిష్కరించుకోటానికి ప్రజల జీవితస్థాయిని పెంపొందించుకోవటానికి యీ వుద్యమము లేవదీశారు అని చెప్పుచున్నాను. అంతేగాక యీనాడు వున్నటువంటి పరిస్థితులను బట్టి ఆంధ్రులందరును ఒక బ్రహ్మాండమైన ఉద్యమాన్ని ఆంధ్రరాష్ట్రముకొరకు లేవదీసి, త్యాగముచేసి, వారియొక్క ఆశయా

లన్నీ సాధించుకోగలిగారు. ఈనాడు ఆంధ్రులను ఎదుర్కొనేటటువంటి వ్యవసాయ సమస్యలు పరిష్కారము చేసుకొనుటకు కొన్ని ప్రణాళికలు అవసరమైయున్నవి. గవర్నరు ఉపన్యాసము పరిష్కారమార్గము చూపుటలేదు. 100 కి 99 మంది ప్రజల సమస్యలు పరిష్కరించే మార్గములు ప్రభుత్వము తలపెట్టవలసియున్నప్పటికిని, ఆమార్గము లేవియు కనబడటములేదు.

ఏ ప్రజలచేత ఏపార్టీ టికెటుమీద ఎన్నుకోబడి ఎసెంబ్లీకి వచ్చి కూర్చున్నారో, ఆ టికెటు మార్చడం ప్రజాస్వామికమా? చెప్పేటప్పుడు మాది ప్రజాస్వామికం అంటారు. నాగభూషణంగారు రష్యా constitution తెలిసి మాట్లాడారా? ఇక్కడ ఆ ప్రశ్నరాని సందర్భంలో, ఆ దేశపరిస్థితులు తెలియకుండా అసందర్భంగా మాట్లాడారు. ఈ నాయకులు 'సర్వేజనాఃసుఖినోభవంతు' అని పెద్దపెద్దమాటలు చెబుతారు. అన్నిపక్షాలూ ఏకంకావాలంటారు. రష్యాలో, ప్రజలందరూ ఐకమత్యంతో ఒకేపక్షంగా ఏర్పడి, అందరూ ఒకే ఆశయంతో వారి సమస్యలు పరిష్కరించుకునే సమాజం ఏర్పడితే, అక్కడ ఇతరపార్టీలు లేవుకాబట్టి ప్రజాస్వామికం లేదని విమర్శించడం అసందర్భంగాక అనాలోచితమున్నూ, వాస్తవానికి విరుద్ధమున్నూ. ఇక్కడ ఏర్పడిన ప్రభుత్వం ప్రజాస్వామిక మనడం హాస్యాస్పదం. ఉపన్యాసాలలో మాత్రం గాంధీగారి సిద్ధాంతాలు మీరు చెప్పినా, సమయంవచ్చినప్పుడు ఆచరణంతా వేరుగాఉంటుంది. రష్యాలో ఇల్లాంటి పార్టీలు ఏర్పడవలసిన అవసరంలేదు.

Deputy Speaker:—ఎమెండుమెంటుమీదే మాట్లాడుతున్నారా ?

Sri B. Sankarayya:—కొందరు రష్యా విషయం అనవసరంగా మాట్లాడడంవల్ల ఆ విషయం చెప్పవలసివచ్చింది. ఈ ప్రభుత్వానికి దమ్మిడీ ఖర్చు లేనట్టిది, బంజరుభూములు ఇవ్వడానికి రాజగోపాలాచారిగారు పెట్టిన G. O. రద్దు చేయమని ఒక సవరణ ఉంది. Pay కమిషన్ సిఫార్సులు అమలు జరుపమని సవరణ ఉంది. ఉపాధ్యాయులు, పోలీసులు, చిన్నచిన్న ఉద్యోగస్తులు గుమాస్తాలు వచ్చే జీతాలు చాలక అవస్థపడుతూంటే మన మంత్రి కోటిరెడ్డిగారు వెయ్యి రూపాయలు చాలవని సెలవిచ్చారు. 30 రూపాయలు తీసుకునే పోలీసు గతి ఏమిటి? 40 రూపాయలు జీతం

[Sri B. Sankarayya] [28th November 1953

తీసుకునే గుమాస్తా గతి ఏమిటి? అందువల్ల గవర్నరు ఉపన్యాసానికి మనం thanks చెప్పవలసిన అవసరంలేదు.

Sri K. Vardachari:—ఉపాధ్యక్షా! ఈ దినం చర్చకు వచ్చిన విషయం సోషలిస్టుపార్టీవారి ఎమెండుమెంటు మీాదనే చర్చకు ఉత్తరువు ఇవ్వబడింది. కావున అంతవరకే నేను మాట్లాడ దలచుకొన్నాను. ప్రజాస్వామిక సాంప్రదాయాలమీాద శ్రీరాజాగారికి విశేషమైన అభిమానం గలదు. వారు రాష్ట్ర పురోభివృద్ధికి సాకర్యాలు ఏర్పడాలి అంటే ప్రజాస్వామిక సాంప్రదాయాలు చక్కగా మనం నిర్వహించితే కాని ఈ రాష్ట్రం యొక్క మర్యాద చెడిపోతుందని వారికి గట్టినమ్మకం. అందువల్ల అంత తీవ్రంగా మాట్లాడుతున్నారు. ఐతే ప్రజాస్వామిక సాంప్రదాయములందు అంతటి నమ్మకం కలవారు అధ్యక్షులుకూడా. రూలింగులుగాని, తీర్మానాలుగాని ఈ ప్రజాస్వామిక సాంప్రదాయాలకు, అనుకూలంగా లేవని అంత తీవ్రంగా మాట్లాడదలచుకున్నారు. వారు చేసింది, చేయదలచుకున్నది ఏమిటంటే ప్రజాస్వామిక పద్ధతి ధ్వంసంచేసేపద్ధతి అనుసరించారు. ఎందుకంటే ఇన్నిపార్టీలు అనేక సవరణలూ తీర్మానాలూ గవర్నరుగారి ఎడ్రసుకు ప్రవేశపెట్టిన తరువాత యోచించుకొని ప్రత్యేకంగా ఈ సమస్యను, మరల వేరేరూపంగా దాన్ని చర్చచేసుకోవలసిన అన్నిపార్టీల వారూ సమ్మతించి, వారివారి, సవరణలు రద్దుచేసుకొంటూాంటే, వారిని ఇంకోదినం మాట్లాడనివ్వను, వారు ఇంకో rule క్రింద చర్చ జరగకపోతే మరోదినానికి అదే విషయం తీర్మానరూపంగా గాని మరోవిధంగా గాని మాట్లాడకూడదని rule తీసుకువచ్చి అడ్డుపెట్టి ఆ సంకల్పాన్ని నిరోధించి వారిని మాట్లాడనివ్వకుండా చేయడం ముఖ్యోద్దేశ్యంగా పెట్టుకొని, నా సవరణ ఉపసంహరించుకొనలేదు, ఇది చర్చ జరగవలసిందేనని పట్టుపట్టడం నాకు చాలా ఆశ్చర్యంగాయుంది. యువకులూ, ప్రజాస్వామిక సాంప్రదాయాలందు మీాకన్న తీవ్రమైన నమ్మకం, అభిమానం గలవారు ఈ సభలో యూావన్మంది పార్టీలు దీన్ని పూర్తిగా చర్చించుకొని ఏదో సామరస్యంతో చర్చ చేసుకొనుటకు సంభాషణలు జరుగుతూయుంటే, అటువంటి సామరస్యం లేకుండా చేయాలనే ఉద్దేశ్యం కనబడుతోంది కాని వేరే ఉద్దేశ్యం కనబడుటలేదు. కమ్యూనిస్టులుకూడా ప్రభుత్వాన్ని చిరస్థాయిగా చేయుటకు ప్రయత్నిస్తున్నారనే వటకూ కోపంవచ్చింది. రేపుకూడా వీరితో

సహకరించే ప్రభుత్వాన్ని నిరోధించుటకు ప్రయత్నాలు జరిగేపట్ల అటు వంటిది జరగకుండా ఆగ్రహం కల్గించుటకు ఎంత మాట్లాడాలో అంత మాట్లాడారు (నవ్వు). ఇటువంటి ధోరణి నిండా శోచనీయం. ఆంధ్రరాష్ట్రం వచ్చిన నెల రోజులలోగా అనేక పార్టీలు కుదరడం, అనేక అభిప్రాయాలు కుదరడం, ఈ capital విషయంలో వివిధమైన త్రోవలలో ప్రతి ఒకరూ దానికి సవరణలు పెట్టడం లేకపోతే నిరోధించడం, అటువంటి మార్గాలలో ప్రవేశించాము. ఆంధ్రులు ఈ రాష్ట్రాన్ని నిలబెట్టుకుంటారా, చక్కగా నిర్వహిస్తారా అని రాష్ట్రాన్ని మనకు కుదర్చకముందు నాయకులు సందేహించినారు. అటువంటి సమయంలో మన జాగ్రూకత, మన నైపుణ్యం, మన విజ్ఞానం, మన బుద్ధి కుశలత ప్రదర్శించే మార్గం వదలిపెట్టి, ప్రతి ఒక్కరి కౌశల్యం దానిలో చూపిస్తున్నారా అంటే, ఏ మాటచెబితే ప్రతి కక్షికి బాధాకరంగా ఉంటుంది అనేధోరణి పడిపోయింది. వారికి నేను చెప్పే మాటలు అసహ్యంగా కోపకారణంగా ఉండాలనికాదు. మమ్మల్ని-సాధారణంగా చిత్తూరులో ఉండేవారినికూడా.

(At this stage the Speaker occupied the Chair.)

కోటిరెడ్డిగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రమహాసభలో వుండే రోజుల్లో, ఈ ఆంధ్రరాష్ట్రం సర్కారువారికి కాని మనకు లాభంలేదు, వారి జనసంఖ్య జాస్తి, వారి ఆర్థికస్థితి బాగావుంటుంది, మనలను వారు నలిపేస్తారు అని భయపడ్డాం. అటువంటి సమయంలో మాకు చెప్పినంతలో ఈ రాష్ట్రాన్ని ఒప్పుకోము అని చెప్పారు. అంతమంది అడ్డంగా వున్నారు, అందరిని కలపాలి. 1938 సంవత్సరములో మా అనంతశయనం ఆంధ్రమహాసభకు అధ్యక్షుడు. నేను వారికి కార్యదర్శిని. ఆ ప్రకారం పని చెసాము. ఈ దినం ఏమైనది? పెద్దలు చేసిన శ్రీబాగు ఒడంబడికలో permanent capital కోరుకునే హక్కు మాకువున్నా, temporary capital కూడా కోరుకొనేందుకు హక్కు లేకుండాచేద్దామని చూస్తున్నారు. మేము ఒత్తిడి, ఆందోళన, గడబిడలుచేసి మనకు temporary capital రెండు నెలలు వుంచినట్లే వుంచి తీసుకుపోతాం అంటున్నారు. మరల మళ్ళీ గుంటూరు, విజయవాడ, లేకపోతే గుంటూరు cum విజయవాడ వస్తోంది. మరి కొందరు విశాఖపట్నం పోదాం, మరొకచోటికిపోదాం అని అన్నారు. రేపే మరొక నిర్ణయం చేసుకొనిపోదాం అంటున్నారు.

[Sri K. Varadachari] [28th November 1953

(Interruption:—తిరుపతి పోదామంటారా ?)

తిరుపతివద్దనే నా అభిప్రాయం. మా ఏడుకొండలవాడు సౌకర్యంగా వుండాలంటే అక్కడకు ఇటువంటివి ఏవీ రావద్దనే నా అభిప్రాయం (నవ్వు). ముఖ్యంగా నిష్పక్షపాతంగా యోచనచేస్తే మనకు capital గా వుండదగిన పట్టణం ఒకటైనా వున్నదా అని నేను అడుగుతున్నాను. అనుకూలంగా వున్న ఈ పట్టణాన్ని వదలి గుంటూరు కావాలి, విజయవాడ కావాలంటున్నారు. విశేషం భూస్వాములు, ధనవంతులు వుండే ఆ చోట కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి రాజధాని కట్టాలనడం శోచనీయం. దీనికి కారణం ఏమిటయ్యా అంటే కర్నూల్లోవుండే 2000 మంది గుమాస్తాలు కష్టపడుతుంటే చూడలేకపోతున్నాం, వారికి మంచిచోటు కుదర్చవలెనా, లేదా, అంటున్నారు. వీరందరినీ కూర్చోబెట్టడానికి గుంటూరు, విజయవాడల్లో మాత్రం భవనాలున్నాయా? ఊరు పెద్దదే, విజయవాడ జనసంఖ్య బాహుళ్యం. ఎక్కడయ్యా 2000 భవనాలు తీసి ఇస్తారు ? లేకపోతే కడతారట ! ఎక్కడైనా కడతారు ! గుంటూరు, విజయవాడ అయితేనే కడతారా ఏమిటి ? విశాఖపట్టణంలో 2000 భవనాలు మిలటరీ వాళ్ళవి వున్నాయట. గుమాస్తాలయందు మీకు అంతగా అభిమానంవుంటే గుమాస్తాలనందరిని తీసుకువెళ్ళి మీ భవనాల్లో కూర్చోబెట్టండి, cooperative society పేరుతో భవనాలు కట్టండి. ఆంధ్రదేశ ఆర్థికపరిస్థితి ఎలావున్నదో మనకు తెలుసు. భవనాల నిర్మాణంపై ఎంతఖర్చుపెట్టగలదో తెలుసు. పంచవర్ష ప్రణాళిక బాగా నడపాలి అనే యోచన ఒకటివుండి, ఇవన్నీ వుండగా ఎంత సెలవుపెట్టి 2000 భవనాలు కడతారో ఆలోచించుకోవలె. మనం నిజంగా ఆంధ్ర రాష్ట్ర అర్థిక పరిస్థితి తెలిసినవాళ్ళమైతే, నూతనంగాఏర్పడిన రాష్ట్రపురోభివృద్ధిని కోరే వారమైతే, dispassionate గా ఆలోచించి చూస్తే permanent capital విషయం ఇప్పట్లో ఎత్తక ఊరుకోండి. విశాలాంధ్ర రావాలి. అదివచ్చిన హైద్రాబాదును ముఖ్యపట్టణముగా మనం సుఖంగా చేసుకోవచ్చు. ఆంధ్రులు అంతా ఏకాభిప్రాయంగా వున్నారు. మనం ఇప్పుడు ఏ తీర్మానంచేసినా విశాలాంధ్ర నిర్మాణానికి వ్యతిరేకంగాచేస్తారా ? లేక దానికి అనుకూలమైన ధోరణిలో నడతారా ? విజయవాడ-గుంటూరులు రాజధాని కావాలని ఇంత ప్రమాదంగా ఆందోళన చేస్తుంటే తెలంగాణావారు ఏమనుకుంటారు స్వామీ, ఈ ఆంధ్రదేశంలో ప్రజలు వారిలో

28th November 1953] [Sri K. Varadachari]

వారు జగడాలు పెట్టుకుంటున్నారు,' అని అనుకోరా? ఒకవైపు హైద్రాబాదు రాజధాని కావాలంటూ, మరొకవైపు గుంటూరు-విజయవాడలలో రాజధాని కట్టించి అక్కడకు పంపించాలని చూస్తున్నారు. ఇదేనా మన మార్గం? ఇప్పటికీ యోచన చేయండి, ప్రమాదకరమైన తీర్మానాలు ఈ నాడు మీరు చేస్తున్నారు. నిజంగా విశాలాంధ్ర జయప్రదం కావాలంటే, నేటి ఈ ప్రవర్తన చాలించి విశాలాంధ్ర సంపాదనలో యావన్మంది నిమగ్నులై పనిచేయండి. జగడాలు లేకుండా పనిచేయండి. దీనిలో ఏదో రాజకీయ రహస్యం వున్నదని తెలుసుకోండి. ఏదో ఆ జిల్లాలకు మాకు పలుకుబడి వస్తోంది. కొంతవరకు మా పంతులుగారి ప్రసాదంవల్ల, ఆ condition చెరచకుండా వుండాలి అనే వుద్దేశంతో మీరు ప్రయత్నిస్తున్నారు. అంతా అదే అంటున్నారు. మీకు ఒక spring board కావాలి. దానికే చూస్తున్నారు. ఆ దూకుడుబల్ల దొరికితే, ఎటుకావలిస్తే అటు దూకవచ్చునని చూస్తున్నారు. అది మానుకోండి. రాష్ట్రంమీద మీకు అభిమానం వుంటే అది మానుకోండి. విశాలాంధ్ర నిర్మాణానికి నేరుగా పూనుకొని, రాజధాని మార్పుకై ఆందోళన మానుకోండి. రాజధానికి అనుకూలమైన పట్టణం ఏదీ లేనిస్థితిలో వున్నాం. కాని సోషలిస్టు పార్టీ తీర్మానంలో 1954-1955 ఈ లోగా మార్చివేయాలి అనడం అర్థం లేదు. 1955 April నాటికి Boundary Commission వాళ్ళు రిపోర్టు చేసి తీరాలంటే వీలు ఎక్కడ? అది ఎట్లా సాధ్యం అవుతుంది. కమిషను వారు ఫలానా తారీఖులోగా రిపోర్టు వ్రాయాలి అనేందుకు మనకు ఏమి అధికారంవుంది? విశాలాంధ్ర మీరు పెట్టిన తేదీలోగా రాకపోతే అని అంటే, మీది నిజంగా honest endeavour అవునా అని అడుగుతున్నాను. విశాలాంధ్రయందు సోషలిస్టుపార్టీ వారికి నమ్మకం వుంటే నిజంగా ఇటువంటి తీర్మానం ఈ రూపంలో ఇస్తారా అని అడుగుతున్నాను. విశాలాంధ్ర విషయం తేలినవెంటనే, మీకు ఇష్టమైన ప్రదేశం permanent capital గా చెప్పుకోవచ్చును. కమ్యూనిస్టులు 1954 ఏప్రిల్ నాటికే పోవాలంటున్నారు. ఈ రాజధాని మూడునాళ్ళ ముచ్చట చేయాలనే మీ కోరిక. అంతకి గుమాస్తాల కష్టమే కారణం. అక్కడవుండే భూస్వాములు, షావుకార్లు డబ్బు తెచ్చి సెలవు పెడుతున్నారు.

కాబట్టి నేను అడుగుతున్నాను. "మీరు విశాలాంధ్రకొరకు మనః

[Sri K. Varadachari] [28th November 1953

పూర్వకంగా ప్రయత్నం చేయడానికైనా ఈ రాజధాని మారుద్దాం అంటున్నారు." సర్కారువారు రాయలసీమమీాద కనబరుస్తున్న ప్రేమ నిజమైనదే అయితే శ్రీబాగు ఒడంబడికను మన్నించ నవసరంలేదా? ఈ temporary capital అయినా కర్నూలులో వుంచరాదా? మీాకు capital ఎందుకయ్యా మీాకు కావలసినది projects కదా, మీా రాయలసీమను వృద్ధిచేస్తాం, ఇంకా develop చేస్తాం. నా మాదిరిగా develop చేస్తాం అంటారు. (Laughter)

Sri Pillalamrri Venkateswarlu :— వరదాచారిగారు రాజీనామా యిచ్చినట్లు పత్రికల్లో పడింది. ఇంకా యిక్కడేవున్నారేమి అని అడుగుతున్నాను.

Mr. Speaker :—నిన్న ఇక్కడ newspapers అన్నీ కాల్చివేశారు. అందువల్ల newspapers చూసేదానికి అవకాశం లేకపోయింది. సభ్యుడు రాజీనామా యిస్తే వా రా సీటులో ఉండకపోవటమే గుర్తు. వేరే ప్రశ్న వేయుడానికి అవకాశంలేదు.

The House then adjourned to meet again at 3–0 P.M.

(After Lunch 3–00 p. m.)

Mr. Speaker:—The discussion on Governor's Address will continue. I now call upon the Leader of the Opposition to speak.

Sri P. V. R. Gajapathi Raju:—Mr. Speaker, I would like to say a few words about your promised ruling. You have promised to give a ruling and I just wanted to remind you about that. Apart from this, I would like to point out one thing to this House and to the Treasury Benches in particular. It was raised that a substantial amendment to the Governor's Address would tantamount to a vote of confidence. I want to inform this House that in a similar instance in British History in 1924 when M. Baldwin was Prime Minister of England, an amendment was moved to the speech of the Crown and the Government accepted that amendment and they did not resign. The Government

28th November 1953] [Sri P. V. R. Gajapathi Raju]

did not consider it tantamount to a vote of confidence. We follow the British parliamentary system and it is not correct for the Government to say that any amendment to the Governor's Address would be tantamount to a vote of confidence. But I want to make it clear that in the instance of capital the Government are not fair both to the Legislature and to the public at large in Andhra.

Sri T. Nagi Reddi:—అధ్యక్షా, మనం ఈనాడు ఇక్కడ సమావేశమౌతున్నటువంటి ఈ శాసనసభ గురించి దేశం మొత్తంమీద ఎదురు చూస్తున్నటువంటి ఈ శాసనసభలో ఈనాడు జరుపుకుంటున్న విషయం మీద ప్రాధాన్యత మన అందరకు తెలుసు. ఆంధ్ర శాసనసభ ఏర్పడ్డానికి ఆంధ్రరాష్ట్రం రావడానికి ప్రధానకారణం అయినటువంటి ఆంధ్రదేశంలోని పెద్దలు, ప్రముఖులు ప్రముఖమైన పాత్రవహించి అందులో ప్రాణాలను కూడా అర్పించిన అమరజీవి పొట్టి శ్రీరాములు, వారితోపాటు ప్రాణాలను అర్పించి ఆంధ్రరాష్ట్రాన్ని సుస్థిరం చేసినటువంటి ఆంధ్ర యువకులకు ఈనాడు మా అంజలి ఘటిస్తున్నాము.

ఆంధ్రరాష్ట్రం కావాలని ఈ రాష్ట్రం ప్రజాస్వామిక పద్ధతులమీద నడపడానికి అవసరమైనటువంటి ప్రజాస్వామిక సూత్రాలను అమలుపరచడం అవసరం. ఈ ప్రజాస్వామిక సూత్రాలను అమలు జరపడానికి ఏమాత్రం పూనుకోనటువంటి ఒక ప్రభుత్వ చర్యను ప్రప్రథమంగా ఆంధ్రదేశంలో ఎదుర్కోడం, దీనికోసం ప్రాణాలను అర్పించి సాధించిన విజయం ఆంధ్ర దేశ చరిత్రలోనేగాక, భారతదేశ చరిత్రలోకూడా సువర్ణాక్షరాలతో లిఖించబడుతాయి అనడాని కీనాడు మనకు ఎట్టి సందేహములేదు. మనం ఈనాడు నిర్మించుకున్న ఆంధ్రరాష్ట్రం రానున్న భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి నాంది. ఈ విషయంలో ఆంధ్రప్రజలమైనటువంటి మనం గర్వించ వలసిఉంది. ఆంధ్రరాష్ట్రం సాధించడానికి చలింపక ఏమాత్రం అడ్డుపడక సర్వకాలాలందు అందుకొరకై పనిచేస్తూ వచ్చినటువంటి మిత్రులు ఈనాడు విశాలాంధ్ర ఆందోళన, పోరాటం సాగించి నిజమైన నైతిక విజయం సాధించి తీరుతారనేదాంట్లో సందేహంలేదు. ఈ విశాలాంధ్రకు అడ్డుగా ఉన్నటువంటి కొన్ని వ్యతిరేక శక్తులను పైదొలగిస్తేతప్ప మనం విశాలాంధ్రను నిర్మించడం సులభంకాదని మనకు తెలుసు. దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలను సాధించవలసియుంది. భారతదేశంలో యీనాడున్నటువంటి

[Sri T. Nagi Reddi] [28th November 1953

స్వదేశ సంస్థానాలన్నిటినీ ఊడగొట్టితే తప్ప మనం భాషాప్రయుక్త రాష్ట్రాలను సాధించలేము. ప్రజానీకం యీనాడు విశాలాంధ్ర ప్రాముఖ్యతను గుర్తించ డానికి తగినటువంటి ఆందోళన పోరాటం సాగించాలి. ఈనాడు ఉన్న ప్రభుత్వం మన ప్రధానమంత్రి మనం విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతున్నా ఇది సామ్రాజ్యవాదుల తత్త్వం అని అవహేళన చేయలేదా?

దేశంలోని సంస్థానాల రద్దుకావడంతో, సంస్థానాలు భారతదేశంలో విలీనమైనవని గుర్తించినప్పుడు బ్రిటిషు సామ్రాజ్యవాదులు నిర్మించుకొన్న స్వదేశ సంస్థానములు, ఆటపట్టులు శిథిలమైనవని మరచిపోకూడదు. ఈనాడు వున్న ప్రభుత్వం, బాధ్యతతో కూడుకొన్న యీ ప్రభుత్వం, దీనికి మన ప్రధాన విశాలాంధ్ర నిర్మాణమును యిది సామ్రాజ్యవాదుల తత్వమని చెప్పడం, అది విశాలాంధ్ర స్థాపన సామ్రాజ్యవాదుల తత్వమని అర్థము కాక తప్పదు. ఇది చాల శోచనీయమైన విషయం. అందుచేత, ఆంధ్ర రాష్ట్రం సాధించినది సామాన్య విషయంకాదని, ఈనాడు భారతదేశంలో స్వరాష్ట్రసిద్ధికి త్యాగాలు చేసినది, అశువులను బాసినది ఒక్క ఆంధ్రమే యని చెప్పక తప్పదు. ఇది సామ్రాజ్యవాదుల తత్వమా? ఆనాడు భారత దేశము సాధించినది సామ్రాజ్యవాదుల తత్వముకాదా? ఈనాడు వున్న యీ రాజ్యాంగవిధానము, దేశం మొత్తంమీద ఒక నూతన రాజ్యాంగ చట్టం నిర్ణయించాలని ఆంధ్ర ప్రజానీకానికి యీనాడు ఆంధ్రులకు తెలి యకపోలేదు. ఈనాడు రాజకీయ నాయకు లవలంబించే పద్ధతులు, వారి రాజకీయవాదాలు ప్రజలకు తెలియనివికావు. అందుచేత ప్రభుత్వములో వున్నవారు బాధ్యత వహించవలసిందని నేను మనవి చేస్తున్నాను. దేశం మొత్తంమీద, బ్రంహాండమైన భారతదేశానికి సంబంధించిన దీ సమస్య. యీ భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణమనే యీ విషయము మీదకు, ప్రభుత్వమునకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

మనం స్వరాష్ట్రము స్థాపించుకొన్న యీరోజులలో, అభివృద్ధినికోరు తున్న యీరోజులలో, నిజమైన ప్రజాస్వామిక సిద్ధాంతాలపై యేర్పడిన ప్రభుత్వమేనా అని సందేహం వస్తోంది. రాష్ట్రం వద్దు వద్దు అన్నవారు ప్రభుత్వంలోకి వచ్చారు. ప్రభుత్వం యేర్పరచారు. ఏ పార్టీకాని యే పద్ధ తులమీద నడుస్తున్నదో ఆ వివిధ పార్టీలయొక్క సిద్ధాంతాలను వారు

సాధించిన ఆశయాలు, వారు చేసిన ప్రయత్నాలు అవన్నీ ఆంధ్రప్రజల ముందు వున్నవి. శక్తికొలది సాధించిన ఆంధ్రరాష్ట్రం యేవిధంగా యేమౌతుందో అనుకొన్నది, ఆంధ్రరాష్ట్రం సాధించిన తరువాత, ఈనాడు, ఆయా సిద్ధాంతాలు ఆచరణలో వున్నవో, లేవో అన్నదికూడ, మనం చూడాలి. ఆంధ్రరాష్ట్రం సాధించాము. నూతనంగా యేర్పడినటువంటి యీ రాష్ట్రంలో క్రొత్తగా ఒక మంత్రివర్గంను స్థాపించినాము. అంతమాత్రమే అది అవసరం. అది రాజ్యాంగసూత్రము. అది Assembly పిలిపించవలసిన బాధ్యత వున్నాకూడ, నిన్న మొన్నటివరకు Assembly ని సమావేశపరచలేదు. ఈ విషయంలో దీని ఆవశ్యకత గుర్తించమని గవర్నరుగారికి పలుమారులు వ్రాశాను. ఈ విషయం శ్రీ ప్రకాశం పంతులుగారికి శ్రీ T. Viswanatham గారికి తెలియనిది కాదు అని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఆంధ్రరాష్ట్రం యేర్పడిన ఒక నెల యిరువదిమూడు రోజులకు మనం యిక్కడ సమావేశమైననాటికి ఈ విషయంగూర్చి తెలియచేయవలిసి వస్తున్నది. ఒకప్రభుత్వము యేర్పడిన తరువాత ఆ ప్రభుత్వము Assemblyని పిలవకుండా, "They have been let loose on the innocent people of Madras province" అనే విషయం చరిత్రకారులు వ్రాయవలసి వస్తుంది.

ఆంధ్రరాష్ట్రాన్ని సాధించాము. అక్టోబరు 1 వ తేదీన రాష్ట్రము ఏర్పడింది. ఏర్పడిన తరువాత జరిగినటువంటి సంఘటన మన కందరికి తెలుసు. ఒక రాష్ట్రము ఏర్పడిన తరువాతనైనాసరే లేక క్రొత్తగా ఎన్నికలు జరిగిన తరువాతనైనా సరే ఒక మంత్రివర్గం స్థాపించిన తరువాత ఆ మంత్రివర్గము అసెంబ్లీలో ఎంత త్వరగా కలుసుకొంటె అంత మంచిది. అది అవసరము కూడాను. ఆ విధంగా అసెంబ్లీని పిలిపించవలసినటువంటి బాధ్యత ఆ మంత్రివర్గముపైన ఉంటుందనే విషయము ఈనాడు ముఖ్యమంత్రిగా కూర్చొన్నటువంటి ప్రకాశం పంతులుగారికిని, ఆనాడు ప్రభుత్వపక్షానికి వ్యతిరేకంగా ప్రతిపక్షములో ఉండినటువంటి విశ్వనాథంగారికిని తెలియనిది కాదు. ఆంధ్రరాష్ట్రము ఏర్పడి మనము సమావేశమైననాటికి ఒక నెల, 28 రోజులు అయినది. అసెంబ్లీని త్వరగా సమావేశపరచవలసిందని మేము అర్థించి, అర్థించి విసిగి వేసరిపోయినాము. ఎన్నికలప్పుడు ఆనాడు ప్రజాస్వామిక సూత్రంగా ఎన్నుకోబడినటువంటి ఆ సూత్రం యీనాడు ప్రజా

[Sri T. Nagi Reddi] [28th November 1953

స్వామిక సూత్రం కాదా ? ఈనాటి ప్రజానీకము ఏమిటో ఈనాటి ప్రజాస్వామికము ఏ రూపంలో అమలు పరచబడుచున్నదో ఒక్కసారి తిరిగి నెమరువేసుకొమ్మని కోరుచున్నాను. గత చరిత్రనుచూచి నేర్చుకోవలసిన గుణపాఠములు తరచి చూచుకొమ్మని విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రజాస్వామికం అమలుపరచడం అని చెప్పినప్పుడు, మార్గం ఒకటి గుర్తుకు తెచ్చుకోవాలి. కలగా పులగం ఉండకూడదనే మాట కాదు. విశ్వనాధంగారు మాట్లాడుతూ, కలగా పులగం కూర చాలా రుచిగా ఉంటుందని, మలబార్ అవయల్ కూర చాల రుచిగా ఉంటుందని అన్నారు. కాని కలగా పులగంలో గూడ ఒక order, ఒక పద్ధతి కూడ ఉంటుందని గుర్తించక ఇష్టను వచ్చినట్లు కలిపితే, అదిమరొక విధంగా పరిణమిస్తుందనే విషయాన్ని గమనించవలసి యుంటుంది. ఈనాడు మంత్రి వర్గము ఏర్పడిన విధాన మేమిటి ? కలగా పులగం కాదా ఇది ? ఇది కాంగ్రెస్ ప్రభుత్వం, దీనికి నాయకులుగా ఉండవలసింది శ్రీ సంజీవిరెడ్డిగారు కాని ప్రకాశం పంతులుగారు కాదు. ఈ నాటి మన మంత్రివర్గం వివిధపార్టీలతో కూడుకొనినటువంటిదై యున్నది. వీరికి ఒక నిర్ణీతమైన కార్యక్రమము ఉన్నట్లు లేదు. వీరు చేరినప్పుడు ఏ కారణాలచేతనైతే చేరారో, ఆ కారణాలను ఆచరణలో పెట్టడానికి ఏమైన ప్రయత్నం జరుగుచున్నదా ? ఈ విచిత్రమైన నూతన మంత్రి వర్గము చూస్తూ ఉండగా అందరికి చాలా తమాషాగా కన్పిస్తున్నది. ఒక్కొక్క రొక్కకమాట, ఒక్కొక్క స్టేటుమెంటు ఒకరిచ్చిన స్టేటుమెంటుకు ఇంకొకరు మరో స్టేటుమెంటు ఇవ్వడము ! ఈ వైరుధ్యాలు ఎందుకువచ్చాయి? ఒక నిర్ణీతమైన కార్యక్రమము, ఒక విధానము, యీ కలగా పులగం మంత్రివర్గం ఆచరించకపోవడంచేత యీ పరిస్థితి ఏర్పడింది. ఈనాడు కాంగ్రెసు నాయకులైన సంజీవరెడ్డిగారి నాయకత్వాన పరిపాలన కొనసాగించబడాలి గాని, అంతకు మించి కొనసాగబడాలి అనేటటువంటిది అసాధ్యం, జరుగదు అనేటటువంటిది ఇదివరకు చరిత్ర చూపిస్తూనే వచ్చింది. ఇది మిశ్రమ మంత్రివర్గము అనడానికి కారణాలు ఉన్నాయా ? లేవు. మిశ్రమము దేనితో ? దేనితోనూ కాదు. ప్రతిఒక్కరు బేషరతుగా కాంగ్రెసుతో చేతులు కలపడం తప్ప మరేమి ఆచరణలో లేదు. ఈ ప్రభుత్వం ఒక కలగా పులగం తప్ప మరేమి కాదు. అంతకు మించి ఈ ప్రభుత్వానికి ఒక కార్యక్రమం లేదు. అంతకు మించి ఈ ప్రభుత్వానికి ఒక policy లేదు, అంతకు మించి ఈ ప్రభుత్వానికి ఒక విధానం

28th November 1953] [Sri T. Nagi Reddi]

లేదు, అనేటటువంటి విషయము ప్రపంచానికంతకు అర్థమవుతున్నది. ఆంధ్ర ప్రజానీకాన్ని మభ్యపెట్టేందుకు ఇక్కొక ప్రయత్నమేగాని వురేమి గాదు. కాని ఇది సాధ్యముగాదు. పోరాటములో ఆరితేరినటువంటిది యీ ఆంధ్ర ప్రజానీకము. మహత్తరమైన యీ ప్రజానీకాన్ని మభ్యపెట్టడానికి సాధ్యంకాదు అని యీ మిశ్రమ మంత్రివర్గములో నున్న వీరందరికి జ్ఞప్తి చేస్తే బాగానే ఉంటుంది. వారి అనుభవానికి తగినట్టే ఉంటుందని విశ్వసిస్తున్నాను. ఇక ప్రభుత్వము వచ్చింది ప్రభుత్వము వచ్చినతరువాత ఎన్ని స్టేట్‌మెంట్లు వచ్చాయి? అవి ఎంతమట్టుకు ఆచరణలో పెట్టబడినాయి? ఆనాడు తిమ్మారెడ్డిగారు బంజరుభూముల విషయములో ఒక స్టేటుమెంటు ఇచ్చారు. ఇది ప్రధానమైన సమస్య. ఆంధ్రదేశంలో దాదాపు 4 లక్షల ఎకరాల బంజరు భూములు ఉన్నాయి. వీటన్నిటిని ఆంధ్రదేశములో సామాన్యప్రజానీకానికి పంచిపెట్టినట్లైన, దాదాపు కొన్నివేల కుటుంబాలను మనము యీనాడు నడిపించటానికి అవకాశముంటుంది. కానియీనాటికైనా ఏమైన కార్యరూపములో జరిగినదా? ఈనాడు మంత్రివర్గము ఇవ్వబోతున్నటువంటి ఈ ప్రధాన ఉపన్యాసములో ఉన్నదా అంటె లేదు. విశ్వనాథంగారు మరొక్కమాట అన్నారు. గండికోట ప్రాజెక్టును ప్రారంభింపబోతున్నామని అన్నారు. రాయలసీమ వెనుకబడినటువంటి ప్రాంతము. ఈనాడు కరువు కాటకాలనుండి విముక్తి కావాలంటే అన్ని విషయముల లోను ఆ ప్రాంతమునకు ప్రప్రథమ అవకాశము ఇవ్వాలి అనే సూత్రము ఆచరణలో పెట్టవలసిందని ప్రతిపక్షంలో సభ్యులందరు గత 1½ సంవత్సరములుగా రాజగోపాలాచారిగారిని అర్థిస్తూనే వచ్చారు. కాని ఆనాడు అర్థించింది అంతా బుట్టదాఖలా అయినటువంటిదనే విషయము అందరికీ తెలుసు. పోనీ, ఇకనైనా మీరు ఆ ప్రాంతాలకు Irrigation, electricity, projects నిర్మించడంలో preferential treatment ఇస్తారని భావిస్తున్నాను.

పోనీ విశ్వనాథంగారు మరొకమాట అన్నారు. ఏదో టెనెన్సీ (Tenancy) Act విషయం అదీ చెప్పారు. పోనీ అందులో కడప కర్నూలు కాలవ విస్తృతం చేయబోతూ ఉన్నామని కాని, గండికోట ప్రాజక్టు ప్రారంభించబోతూ ఉన్నామనిగాని చెప్పలేదు. రాయలసీమలో వెనుకపడిన ప్రాంతాలు, కరువు కాటకాలనుండి విముక్తికావాలంటే ఆ ప్రాంతాలు

[Sri T. Nagi Reddi] [28th November 1953

ప్రప్రథమంగా వృద్ధి పొందటానికి గాని అవకాశం ఇవ్వాలని ప్రతిపక్షంలో కూర్చున్న సభ్యులు, రాజగోపాలాచారిగారిని అర్థిస్తూనే వచ్చాం. వెనుక బడిన ప్రాంతాలకు preferential treatment ఇచ్చి ఇరిగేషన్ ప్రాజక్టు్స నిర్మిస్తామని ఆనాడు ఆమోదించిన విషయం వెనుకబడింది. ఆనాడు రాయలసీమవాసి మన ఆంధ్రుడు ఐన పబ్లికు వర్క్సు మినిస్టరు విచక్షణ లేకుండా ఏది profitable అని చూడటం మొదలు పెట్టారు. అక్కడ ఉన్న మంత్రులకు నేను తెలియజేశాను. పోనీ ఆనాడు కాకపోతే ఈనాడైనా కనీసం ఆంధ్రరాష్ట్రం ఏర్పడిందిగదా, ప్రథమ ప్రభుత్వంగదా? ఆంధ్రరాష్ట్రఎసెంబ్లీగదా ఈ ఎసెంబ్లీలో ప్రజలందరూ ఎదురుచూస్తున్నారు గదా అని వెనుక బడిన ప్రాంతాలకు chance ఇవ్వమని గవర్నరుగారి ఉపన్యాసంలో యీ విషయం లేకపోవడానికి కారణం? పోనీ అది వదలుదాము. రాజధాని సమస్య వచ్చేసరికి శ్రీబాగు పాక్టు వస్తుంది. ఆనాటి వాగ్దానాలు చెల్లించడానికి మీరందరూ ఆటంకమా అని ప్రశ్న? శ్రీబాగు పాక్టు ఆంధ్రజాతి భవిష్యత్తుకు వినియోగించడం మంచిది, ఆ పద్ధతినే మనం పురోగమించడం మంచిదని గమనిస్తే, ప్రాంతీయవిభేదాలను రెచ్చగొడుతూ చేసిన ఉపన్యాసాలు ఏవిధంగా త్రోసిపుచ్చగలరు? దాని ఫలితా లెట్లా ఉంటాయో చరిత్రే నిరూపిస్తుంది. ఒక విషయం మాత్రం అవసరం. ఆంధ్రరాష్ట్రం వస్తేతప్ప రాయలసీమకు ముక్తిలేదని, ఆంధ్రరాష్ట్రం వస్తే తప్ప రాయలసీమలో విద్య, వైద్యం, ఇరిగేషన్ వసరులు, electricity ప్రణాళికలు ఆచరణలోకి రావని కమ్యూనిస్టుపార్టీ చేసినదానికి యీనాడు శ్రీబాగుపాక్టని చెబుతూఉన్న ప్రభుత్వ వ్యత్యాస విధానాన్ని నేను ఆక్షేపించదలచుకున్నాను. శ్రీబాగు ఒడంబడికలో రాయలసీమ కళాశాలలు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేర్చాలని, యీవిధంగా చేర్పించిన విశ్వవిద్యాలయానికి Sub-University centre అనంతపురంలో స్థాపించాలని శ్రీబాగు Pact లో వ్రాసిపెట్టిన మాట వాస్తవమేకదా? ఐనప్పుడు ఆంధ్ర రాష్ట్రం సిద్ధిస్తూయున్న సమయంలోనే మదరాసు ఎసెంబ్లీలో యీ విషయం ప్రస్తావించిన మాకు దానివిషయమై తగునైన నిర్ణయం ప్రభుత్వం చేస్తుందని చెప్పారు. అదీ రాలేదు. ఈనాడైనా కనీసం ఆ విషయం ప్రస్తావించి, దీనివిషయమై చర్యతీసుకొని నెరవేరుస్తామనే హామీ ప్రభుత్వంఇచ్చిందా? ఇవ్వలేదు. శ్రీబాగు ఒడంబడిక అడ్డుపెట్టుకొని ఆంధ్రరాష్ట్రంలో క్లిష్ట పరిస్థితులను మరింత క్లిష్టం చేయుటకు తమ రాజకీయావకాశాలను వదిల

పఱచుకొనుటకు ఈ శ్రీబాగు ఒడంబడిక అడ్డుపెడుతున్నారు. లేకపోతే నిజంగా శ్రీబాగు ఒడంబడిక ప్రకారం యీకార్యక్రమం ఆచరణలోపెట్టారనుకున్నారా అని ప్రశ్నిస్తే, అందుకు యీనాడు కళ్లకు కట్టినట్లుగా కనిపించే వ్యవహారం, శ్రీబాగు ఒడంబడిక ప్రజలను మభ్యపెట్టడానికి ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టడానికీ, పోయిన తమ నాయకత్వం తిరిగి సంపాదించుకోడానికీ యీ చిన్న విషయాన్నిబట్టి చూస్తే అర్థమవుతోంది. అవునా కాదా అని ప్రశ్న ? అంతే కాదు.

శ్రీబాగ్ ఒడంబడికలోనిది ఒక విషయము చెప్పదలచాను. స్పష్టంగా ప్రస్తావించబడనటువంటి, ప్రస్తావించవలసినటువంటి విషయములు చెప్పడము అవసర మున్నది. ఈ ఒడంబడిక కారణముగా అక్కడ సర్కారు ఆంధ్రులు ఇక్కడ రాయలసీమ ఆంధ్రులు కూడా, ఆంధ్రరాష్ట్రం త్వరలో సిద్ధించటానికి మనమందరము ఐకమత్యముతో పోరాడాలి, అని అందులో ఒక మాటవున్నది. ఈనాడు రాయలసీమకు రాజధాని లేకపోతే యివిగో, మారాజీనామాలు తీసుకోండి, అని బెదరిస్తున్నటువంటి వారిని నేనొక ప్రశ్న వేయదలచాను. అదేమిటంటే, ఆంధ్రరాష్ట్రం రావాలని ఆనాడు కోరుతున్నటువంటి సందర్భంలో, యీనాడు రాజధాని మాకురాకపోతే, మేము రాజీనామాలు యిస్తామని బెదిరిస్తున్నటువంటి యీ M. L. A. లు, మాకు ఆంధ్రరాష్ట్రం అవసరములేదు అనే విషయాన్ని సాకుగాచెప్పి బెదరిస్తున్నారు. రాయలసీమవారు ఆనాడు ఆంధ్రరాష్ట్ర స్థాపనకు వ్యతిరేకించినపుడు యీనాడు శ్రీబాగ్ పాక్టు అడ్డమురాలేదా? శ్రీబాగ్ ఒడంబడిక ఆనాడు అందరి ఐకమత్యముతో నిర్మించుకొనిన ఒడంబడిక మన అందరి కూడలి, ఆనాడు లేకపోయిందని విశ్వసించమంటారా ? ఆంధ్ర రాష్ట్రము సాధించిన తరువాత మాకు ఆంధ్రరాష్ట్రము వద్దు, అని చెప్పినవారికి వ్యతిరేకంగా, రాయలసీమకు వ్యతిరేకంగా ఆంధ్రరాష్ట్ర స్థాపనకు బాహాటంగా ఉత్సాహపూరితమైన ప్రదర్శనలద్వారా ఆంధ్రరాష్ట్రము వద్దు అని వ్యతిరేకించినవారు, రానున్నది రాకుండా చేయలేకపోయినారా? ఈ నిర్ణయము శ్రీబాగ్ ఒడంబడిక జరిగి ఆచరణలో పెట్టాలని అంటే అది దేశములోని వ్యవసాయాభివృద్ధికి కాదా? ఈనాడు ఆ శ్రీబాగ్ ఒడంబడికలోవున్న నిబంధనలు మన ప్రాజెక్టులు నిర్మించుకోటానికి ఎలక్ట్రిసిటి స్కీములను, అభివృద్ధిపరచుకోటానికి కాదా? ఈ శ్రీబాగ్ ఒడంబడిక

రాజకీయ నాయకులచేత ఆంధ్రజాతిని తిరిగి విచ్ఛిన్నము చేయడానికి, ఆంధ్ర రాష్ట్రములో సుస్థిరమైన ప్రభుత్వము వుండకుండా చేయడానికి యీనాడు రాజకీయాలలో ప్రాంతీయ విభేదాలను ప్రజలలో రెచ్చగొట్టడానికి, కలతలు కలిగించి, మహోత్తరమైన మనస్తత్వాలను చెదరగొట్టడానికి, శ్రీబాగ్ ఒడంబడిక నడ్డము పెట్టుకొని రాజకీయనాయకులు ప్రయత్నముచేస్తున్న సంగతి ఎవరికి తెలియకపోలేదు. శ్రీబాగ్ ఒడంబడికను గౌరవించి అమలు జరిపే విషయములో నిజంగా ప్రభుత్వానికి శ్రద్ధవున్నట్లైతే, రాయలసీమ లోను, ఇతర వెనుకబడిన ప్రాంతాలలోను, అభివృద్ధి కార్యక్రమాలను జరప టానికి, యీప్రభుత్వము తక్షణము చర్యలు తీసుకొని వుండవలసినది. ప్రభు త్వము అవలంభిస్తున్న వైఖరినిబట్టి ఆ ఒడంబడికకు కట్టుబడివుండాలని, ప్రభుత్వము హృదయపూర్వకంగా అనుకోవటంలేదని భావించవలసి వస్తున్నది. తరతరాలనుంచి రాయలసీమ సర్కారుజిల్లాలలోని, ప్రజల మధ్యగల వివాదాల పరిష్కారానికే యీ ఒడంబడిక ఏర్పడినది. రాజ ధానిని యీ విధంగా నిర్వహించడంద్వారా, వారు అనుకున్న అభిప్రా యాలు వేరేనని, రాయలసీమ ప్రజాభివృద్ధికి వ్యతిరేకంగా, యీనాడు వీరు ఉపయోగిస్తున్న విధానాన్ని, యిప్పుడు చూచినట్లైతే, యీనాడు రాజకీయ నాయకులు ఏమాత్రమును రాయలసీమకు రానున్నవేవో, తా కల్పించుకోగలవేవో, రాయలసీమ చేయించుకోగలదా? అది నిజము, ఇది రహస్యముకాదు. ఇప్పుడు వున్న గవర్నరుగారు యీనాడు యిచ్చినటు వంటి ఉపన్యాసములో ఒకటిన్నర సంవత్సరముగా, యీనాడు శ్రీబాగ్ ఒడంబడిక ఆచరణలో పెట్టవలెనని చేస్తున్నటువంటి, యీ కాంగ్రెసు వాదుల గత చరిత్ర, మనము జాగ్రత్తగా పరిశీలించి చూస్తే, రాజకీయ వాదులు అధికారములోకివచ్చిసాగించుకొనడానికి ఒక ఒడంబడిక, ఈనాడు సుస్థిర ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి ఒక ఒడంబడిక, సుస్థిరం కాకపోతే దాన్ని ప్రక్కనబెట్టే ధోరణి చూస్తున్నట్లైతే, యీ శ్రీబాగ్ ఒడంబడికను తమ స్వార్థగత లాభాలకు వుపయోగిస్తున్న కొంతమంది వ్యక్తుల చేతు లలో పడిపోయే యీ విషయమంతా మీముందుట పెడుతున్నాను. ఈనాడు కర్నూలు రాజధాని ఏర్పడినది శ్రీబాగ్ ఒడంబడికవల్ల కాదా? కర్నూలు రాజధాని ఆనాడు రాజకీయ అవసరాలను నెరవేర్చుకొనడానికి ఏర్పడిన ఒక నూతనమైన కర్నూలు ఒడంబడిక కాదా? శ్రీబాగ్ ఒడంబడిక ఆనాడు గాని, యీనాడుగాని, యీ ఒడంబడికను సమర్థించటానికి, రాజకీయ

28th November 1953] [Sri T. Nagi Reddi]

నాయకుల చర్యలవల్ల నిదర్శనములుగా కనుబడుటలేదా అని హెచ్చ రిస్తున్నాను. ఆనాడు అక్కడ ఎసెంబ్లీలో జరిగిన చర్చలలో, కర్నూలుకు మీరు ఒప్పుకోకపోతే, వాల్తేరుకు ఒప్పుకుంటారా?, మీరు ఒప్పుకుంటే యిప్పుడు కర్నూలు తీర్మానాన్ని withdraw చేస్తామని చెప్పిన రాయల సీమ ప్రజలు ఆనాడు రహస్య సమావేశం తరువాత బహిరంగంగా అడిగి నప్పుడు వూరుకుని తరువాత కర్నూలు కాకపోతే, కర్నూలుకు మీరు ఒప్పుకోవటంలేదు కాబట్టి, వాల్తేరుకు పోదాము, మీరు ఒప్పుకుంటారా అని అడుగలేదా? ఐతను శ్రీబాగ్ ఒడంబడిక నిర్ణయము వుండగా ఇక్కడ రాయలసీమలో university వున్నదా? అక్కడ "రాజధాని వుండకపోతే" అనే సూత్రాన్ని త్రోసిపుచ్చి, మీరు వాల్తేరుకు పోవటానికి ఒప్పుకోలేదా? ఇది శ్రీబాగ్ ఒడంబడికా, లేక రాజకీయపుకెత్తా, లేకరాజకీయ పంపకమా? దీన్ని కుదుర్చుకొనడానికి ఆనాడు సమాధానము రాలేదు. ఈనాడు సందే హములేదు. దీనికి సమాధానముగా శ్రీబాగ్ ఒడంబడికను ఆచరణలో పెట్ట డానికి యీనాడు రాయలసీమ నాయకులు చేస్తున్నటువంటి చర్యలు ఆంధ్ర జాతిని మరువవద్దని నేను హెచ్చరిక చేస్తున్నాను. ఈనాడు యీ మంత్రి వర్గము తలపెట్టిన కార్యక్రమము ప్రజలెవ్వరు అంగీకరించటములేదు. ఇప్పటికి మూడు రోజులుగా వారు చేయదలచుకున్న ఒడంబడికలు, రాజకీయ ఒడం బడికలు, రాజకీయ కుట్రలు కుదుర్చుకునేవరకు, వారు చేసే చర్యలు ప్రజలను రెచ్చగొట్టటానికి తోడ్పడగలవనే విషయము ఎవరైనా మరుస్తారా? కుట్రలు పన్నియే, యీ కర్నూలు నిర్ణయం అని చూపించారు. రాజకీయ కుట్రల ద్వారా యీనాడు మరొక కుట్రను ప్రకాశం పంతులుగారిద్వారా చెప్పిం చడ మనేది మనముందు పెట్టారు. దానిలోవున్న వుపయోగమేమి? శ్రీబాగ్ ఒడంబడికను ఆనాడు అడ్డము పెట్టుకొని కర్నూలును రాజధానిగా నిర్ణ యించి, యింకను 1956 సంవత్సరమువరకు రాజధానిని శాశ్వతముగా ఏర్పాటుచేయుటకు అవకాశాలు యివ్వకపోవడము కుట్ర అని అనిపించు కోదా? విశాలాంధ్ర లేకుండా హైదరాబాదు రాజధానిగా ఏర్పరుస్తున్నా మనే హామీ మీకు ఎక్కడనుంచి వచ్చింది! అందుకుగాను యీ రూపాం తరమును దేనికి ప్రదర్శింపబడుతుంది? మూడు సంవత్సరాల తరువాత మనము ఏ గుంటూరుకో, వాల్తేరుకో మార్చుకొందాము, అంటున్నారు సరే. యీ మూడు సంవత్సరాలకాలము జరిగిన తరువాత రాజధానిని కర్నూలునుంచి మరొకచోటికి కదిలించటానికి ఒప్పుకుంటే, అప్పుడు యీ

[Sri T. Nagi Reddi] [28th November 1953

శ్రీబాగ్ ఒడంబడిక ప్రసక్తి వుండదా? విశాఖపట్టణమునకు తరలిస్తే, అప్పుడు యీ శ్రీబాగ్ ఒడంబడిక ఏమవుతుంది? రాయలసీమనుంచి మరొక చోటుకు తరలించినప్పుడు శ్రీబాగ్ ఒడంబడికను యీ రాయలసీమ వాసులు మరచిపోతారని అనుకోవలసి వుంటుంది అన్న మాట. అంటే శ్రీబాగ్ ఒడంబడికగురించి పట్టుపడుతున్న మంత్రులలో ముఖ్యంగా రాయలసీమవాసులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఒకప్పుడు అవరోధాలు కల్పించి, తీరా యిప్పుడు రాష్ట్రము ఏర్పడి రాజధాని ప్రసక్తి వచ్చినప్పుడు శ్రీబాగ్ ఒడంబడికను లేవదీసి, తమకు వీలుగావున్నప్పుడు మాత్రమే ప్రజల నెత్తిన రుద్దటానికి వుపయోగించదలచుకున్నారని తేలుతున్నది. ఈ విధంగా వారు తమ ఆశయాలు నెరవేర్చుకొంటున్నారన్నమాట. విశాఖపట్టణమునకు రాజధానిని తరలించటానికి రాయలసీమవాసులైన మంత్రివర్గమువారు శ్రీబాగ్ ఒడంబడికలోని నిర్బంధాలను దుర్వినియోగము చేస్తున్నారని అనడానికి నేను సంశయించడములేదు. తమలో తమకుగల విభేదాలను తుదముట్టించాలని వారు ఆనాడు అనుకున్నారుకాబోలు. కనుకనే కర్నూలు నిర్ణయించారు. నిన్న సభవారికి అందజేయబడిన ప్రసక్తిలో విశాఖపట్టణమని అంటున్నారు. అప్పుడు శ్రీబాగ్ ఒడంబడిక ఏమవుతుందో గుర్తించాలి. అంటే అవసరమైతే శ్రీబాగ్ ఒడంబడిక, అవసరంలేకపోతే, లేదని తెలుస్తున్నది. వీటినే నేను రాజకీయకుట్రలు అని చెప్పుతున్నాను. రాజకీయ వాదుల ఈ చర్యలన్నియును ప్రజలలో విద్వేషాలు రెచ్చగొట్టటానికి ఈనాడు మరొకటి "విశాఖపట్టణము" అనే కుట్ర లేవదీశారు. ఇటువంటి చర్యలు ఆంధ్ర ఐక్యత విచ్ఛిన్నంచేసేందుకు పరగణించవచ్చునంటున్నాను. ఇటువంటి చర్యలు ఆంధ్రజాతి మరచిపోదని హెచ్చరిస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రాన్ని అభివృద్ధి పరచవలసి నటువంటి యీ ప్రభుత్వము యీనాడు ఆంధ్రజాతి విచ్ఛిత్తును కోరుతున్నది. ఈ వర్గాన్ని అభివృద్ధినిరోధక వర్గమని చెప్పక తప్పదు. రాజధానికి ఇక్కడ కర్నూలులో మూడు సంవత్సరాలు తరువాత విశాఖపట్టములో కొంతకాలము, యీలోపుగా హైదరాబాదు వస్తే, అక్కడికి, యీవిధంగా రాజధానిని ఎక్కడికిపడితే అక్కడికి మార్చడమనేది ప్రజల శ్రేయస్సుకేనా? కర్నూలులో తాత్కాలిక రాజధాని అనే పేరుతో యీ షెడ్లు ఖర్చుపెట్టారు. ఇక్కడనుంచి విశాఖపట్టణమునకు మార్చటానికి అక్కడ కొంతధనము ఖర్చుచేయాల్సి వున్నది. అటుతర్వాత హైదరాబాదుకు వెళ్ళితే, మరల ఖర్చు తగులుతుంది. ఈ ఖర్చు అంతయు

ప్రభుత్వం తమ యిష్టమొచ్చినట్లు ఖర్చు చేయడమనేది ప్రజలసొమ్ము దుర్వినియోగము చేయడమేగదా? ఈఖర్చు అంతయు ప్రజలు అంగీకరించరు. వాత్తేరు ప్రసంగము శ్రీ ప్రకాశంపంతులుగారి మంత్రివర్గం రాజకీయ చదరంగపుయెత్తు వేస్తున్నది. అమాయకులైన ఆంధ్రప్రజలను మభ్యపెట్టి, వారికి వారికి మధ్యనున్న ప్రాంతీయ విభేదాలను రెచ్చగొట్టటానికే యీనాటి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. అందుకనే యీనాడు ఆ విధమైన తీర్మానం ప్రవేశపెట్టబడింది. ఆంధ్రజాతిలో ప్రతిఒక్కరికీ నేను జ్ఞాపకము చేస్తున్నాను ఇంతవరకు ప్రభుత్వము తలపెట్టింది, చేసింది పొరపాటు అని అంటున్నాను. యీ పొరబాటును సరిదిద్దుకోటానికి సక్రమమైన మార్గము ఒకటీ లేదా? కర్నూలును తాత్కాలిక రాజధానిగా నిర్ణయించడం, విశాలాంధ్ర వస్తుందని యిప్పుడు చెప్పడంలో యింకా ఆ తప్పునే ఎందుకు స్థిరపరుచుకోటానికి ప్రయత్నించాలి? దేశములోని వాస్తవ పరిస్థితులు చూడకుండా కళ్లు మూసుకొని కూర్చొనరాదు. ప్రజలకళ్లు కప్పటానికి ప్రయత్నించే బదులు ప్రజల అభివృద్ధికి ఎందుకు తోడ్పడగూడదు? ఒక తప్పుచేసిన తరువాత మరొక తప్పును చేయుడంవల్ల అది ప్రమాదకరమవుతుంది. తప్పుడు నిర్ణయంచేసినందున పార్టీలు, పార్టీలోనే చీలికలు ఏర్పడ్డవి. యీ చీలికలు పార్టీలు వేరువేరుగా వుంచి, అందరు తలకొకదారి బట్టుకొని పోతున్నప్పుడు ప్రజలను సర్వనాశనం చేయాలనే ప్రయత్నం తప్ప మరేమిటి అని అంటున్నాను. అలాకాకుండా చేయడానికి, యిప్పటికైనా సరే, ప్రభుత్వం యిదివరలో చేసిన తప్పులను సరిదిద్దుకొని ఏదైనా సర్వజనాంగీకారము పొందే నిర్ణయానికివస్తే, ప్రజలు బాగుపడతారు. కాకపోతే, యీపార్టీలు, చీలికలు ప్రజలను సర్వనాశనం చేయును అని నేను దృఢంగా చెప్పగలను. యీ మంత్రివర్గము యిప్పుడు తలపెట్టిన చర్యలవల్ల ప్రజాభ్యుదయానికి భవిష్యత్తు వుండదని విజ్ఞప్తి చేస్తున్నాను. నాయకులలో వున్న రాజకీయాలు, ప్రజలనెత్తిన రుద్దటానికి ప్రయత్నించడం ప్రజలను మభ్యపెట్టి, విద్వేషాలను రెచ్చగొట్టటానికి దారితీయగలదని హెచ్చరిస్తున్నాను.

(At this Stage, Sri G. Nagabhushanam, occupied the Chair.)

ఇందులోని రాజకీయ ఎత్తును గుర్తించమని అనుభవంలో అందరికీ పెద్దఅయిన ముఖ్యమంత్రిగారికి వినయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

[Sri T. Nagi Reddi] [28th November 1953

ఆంధ్రదేశమును యీనాడు కల్లోలపరచ వద్దని, ఆంధ్రదేశపు పురోభివృద్ధిని ఈనాడు ఆటంకపరచవద్దని, ఆంధ్రప్రజలు కోరితెచ్చుకున్న ఆంధ్రరాష్ట్రాన్ని తిరిగి ముక్కచెక్కలు చేయవద్దని, అటువంటిది జరిగితే బాధ్యతమీదే అని వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఇటువంటిది చాలా ప్రమాదకరం. అందుచేతనే కమ్యూనిస్టుపార్టీ సభ్యులమైన మేము యీ విషయాన్ని ఇప్పుడే ఇక్కడే తేల్చివేయండి అని అంటున్నాం. ఎక్కడో అక్కడ తేల్చి కార్యక్రమాన్ని ఉపక్రమించడం చాలామంచిది. ఈ విషయం తేల్చకుండా అట్టేపెట్టడం కొంతమందికి అవసరం. ఈవిద్వేషాలను రెచ్చగొట్టనిదే తమ రాజకీయా లకు పునాది ఏర్పడదు అని అనుకున్నవారికి ఇది అవసరం. మరిమూడు సంవత్సరాలు ఇలాగే ద్వేషాలు రెచ్చగొడుతుంటే రాయలసీమ మహా నాయకుడు, వాత్తేరు అనే మహానాయకుడు, ఒకరు భద్రంగావుంటే, ఆంధ్రరాష్ట్రం చిన్నాభిన్నమై పోతుందని మాత్రం మనవి చేస్తున్నాను. అంతేకాదు, మూడుసంవత్సరాల తరువాత అన్నారు. ఇందులో ఏర్ప డుతున్న ప్రమాదం మరొకటి వున్నది. 1954 లో హైకోర్టు నెల కొల్పుతాం అన్నారు. 1954 లో ఒక చోట హైకోర్టు నెలకొల్పి, అది హైకోర్టుకాదని, రేపు మరొక చోటికి కదిపితే ప్రాంతప్రాంతాలకు విద్వేషం రెచ్చగొట్టి, అదేమాదిరిగా రాజధాని విషయంలో రెచ్చగొడుతూ తమ నాయకత్వాన్ని నిలబెట్టుకోవాలని చూసే నాయకులు ఆంధ్రదేశానికి వినాశకారులు. ఈ రకమైన విధానాన్ని, ఒక సమస్యను తేల్చకుండా రాజ కీయ ప్రయోజనంకోసం వాయిదా వేసే విధానాన్ని కమ్యూనిస్టుపార్టీ ఎన్నటికీ అంగీకరించదు. మీరంతా జాగ్రత్తగా ఆలోచించండి. ఈ విషయం ఆలోచించడానికి తిరిగి ఇక్కడ సమావేశమౌతున్నాం. నేడు జాగ్రత్తగా ఆలోచించి ముఖ్యమైన యీ నిర్ణయం చేయవలసిన మనం ఆంధ్రదేశ ఐక మత్యాన్ని దృష్టిలో పెట్టుకొని, యీనాటి రాజకీయ పరిస్థితులను దృష్టిలో పెట్టుకుని ఆలోచించాలి అని విజ్ఞప్తి చేస్తున్నాను. సుస్థిరమైన ప్రజా ప్రభుత్వం కావాలి అన్నారు. ప్రభుత్వం వచ్చింది. ప్రజాస్వామిక పక్షాలు ఐకమత్యం కావాలి అన్నారు. ఐకమత్యం అయ్యారు అన్నారు. ఎన్ని బెదిరింపులతో, ఎన్నివిధాలైన ప్రకటనలతో యీప్రభుత్వాన్ని ఏర్పరిచారు? ఇటువంటి ప్రభుత్వం ఉండగలదా? స్థిరత్వం ఉన్నదా? ప్రజాస్వామిక సాంప్రదాయం అన్నారు. ఆనాడు ఒక సాంప్రదాయం చెప్పారు. వివిధ పార్టీలు కలిసి ఒక కార్యక్రమాన్ని ఏర్పాటుచేసుకొని, సంతకాలు చేసు

(b) but regret to note that the Government have not taken immediate concrete steps to speed up the supply of Electricity for agriculture and horticulture in Cuddapah district and in particular in Rajampet and Sidhout taluks and to the Government Fruit Canning Factory at Kodur;

(c) but regret to note that the Government have not provided free educational facilities to the lowest rank of the Government and Local Boards Servants like Peons, Duffadars, Attenders, Forest Guards, Police Constables, etc.;

(d) but regret to note that the Government have not taken immediate concrete steps to repair and improve the minor irrigation sources in the non-deltaic areas;

(e) but regret to note that the Government have not provided gruel centres to the starving Handloom Weavers in the rural area;

(f) but regret to note that the Government have not postponed the collection of different Governmental loans granted to the Agriculturists in Cuddapah district, though they have not yet recovered from the effects of land famine; and

(g) but regret to note that the Government have not paid proper attention to improve the lot of the Horticulturists by granting loans and providing proper marketting facilities and also by not starting the work of canning at the Government Furit Canning Factory at Kodur."

Sri N. Sivarami Reddi :—Add the following at the end:

"(a) but regret to note that the Governor's Address does not contain any promise of immediate relief to the indebted peasantry by declaring moratorium for a certain period over debts due to the money lenders, Government and Co-operative Banks;

(b) that on the other hand the Government are collecting loan instalments in Cuddapah District from peasants who are still struggling in distress and who are being compelled to sell away their harvest at low prices;

(c) that the loss caused by heavy and continuous rains and the destruction caused by pests have not been taken

[Sri N. Sivarami Reddi] [28th November 1953

into consideration and no steps have not been taken to counteract the same;

(d) that the Government have decided to enforce Prohibition more rigorously in spite of the fact that it is a total failure;

(e) that the Government have decided not to take up Gandikota, Thungabhadra High Level and Remodelling of Kurnool-Cuddapah canal projects by spending State Finance which could be secured through the abolition of Prohibition;

(f) that the Government have not made any effort to keep up the prices of commercial crops like groundnut, onion, etc.;

(g) that the Government have not revised the policy of the previous Government of the Composite Madras State regarding the holding of elections to the Second Class Panchayats by open method of voting;

(h) that the new modified scheme of elementary education is being implemented, though it was voted by the Assembly of the Composite Madras State;

(i) that the prolonged traffic dislocation caused by the recent floods in the Pennar river in Cuddapah district which can be prevented by constructing a bridge at Chennur and by widening and raising the level of the cause way on the Proddatur-Yerraguntla road, is not mentioned;

(j) that preventive measures have not been undertaken during the out-break of cholera in Cuddapah district;

(k) that the Government have not decided to carry on the administration of the State in the language of the people, for which the people of Andhra have fought since long time;

(l) that the Government have closed almost all the gruel centres in villages where large numbers of weavers lived;

(m) that no steps have been taken to protect the ryots from the eviction of the inamdars in the inam villages;

28th November 1953] [Sri N. Sivarami Reddi]

(n) that no attention is paid to the just demands of the Non-Gazetted Officers and no steps are taken to put down curruption, nepotism and red-tapism."

Sri G. C. Kondaiah :— Add the following at the end : "Since the major river valley projects will definitely take much time and since the tanks and channels in the Province are almost defunct, minor irrigation projects and improvements to the tanks, dams, channels etc., which will become useful even under any major scheme, will at once be taken up to be built all over the Province especially in non-delta and backward areas."

Sri K. Malakondayya:—Add the following at the end: "ప్రస్తుతం మన రాష్ట్రములో నిరుద్యోగసమస్య అతి ప్రధానమైన సమస్యగా ఉన్నది. దాని పరిష్కారమునకు స్పష్టమైన సూచనలు యివ్వనందుకు నేను విచారించుచున్నాను."

Sri K. Malakondayya:—Add the following at the end: "నాన్‌గెజిటెడ్ ఉద్యోగస్తులకు జీతాలు పెంచడం మొదలగు సమస్యల మీద వారికి సౌకర్యాలను కలిగించుటకు హామీ యివ్వనందుకు విచారించుచున్నాను."

Sri K. Malakondayya:—Add the following at the end: "వ్యవసాయ కూలీలకు కనీస కూలిరేటు నిర్ణయించడంలో పేర్కొనక పోవడం విచారించుచున్నాను."

Sri K. Malakondayya.—Add the following at the end: "బంజరు భూములు పేదలకు యివ్వడంలో ప్రస్తుతం వేలం వేయుట మొదలగు ప్రతిబంధకాలను తొలగించుటకు తగిన హామీని పేర్కొనక పోవడం; అందుకు విచారించుచున్నాను."

Sri K. Venkata Kurmi Naidu :—Add the following at the end: "ఆంధ్ర ప్రజానీకంలో అత్యధికము బంజరుభూములను, భూమి లేని రైతు కూలీలకు, హరిజనులకు వెంటనే ప్రత్యేకించి యిచ్చుటకు తగిన ఏర్పాట్లు చేయమని ప్రభుత్వమును యీ సభవారు కోరుచున్నారు."

Sri K. Venkata Kurmi Naidu :—Add the following at the end: "ఆంధ్ర ప్రజానీకముయొక్క ముఖ్యోద్దేశమేమన, చిన్న చిన్న నీటి వనరులను ప్రభుత్వము తక్షణము జరిపించేటట్లు యేర్పాటు చేయవలె నని యీ సభవారు కోరుచున్నారు."

Sri K. Rajagopala Rao:—Add the following at the end: "కాని, ప్రభుత్వ వ్యవహారాలన్నీ తెలుగులో జరిపించడంపట్ల ప్రభుత్వ విధానమేమిటో స్పష్టంగా వ్యక్తీకరించనందుకు, ఆంధ్ర భాషాభివృద్ధికై ప్రభుత్వం తీసుకోనున్న చర్యల్ని తెలియజేయనందుకు, తన ప్రసంగాన్ని ఆంధ్రభాషలోకి అనువదించి అందించనందుకు ఆంధ్ర శాసనసభ విచారం వెలిబుచ్చుతున్నది."

Sri K. Rajagopala Rao:—Add the following at the end: "కాని, చాలా కాలంగా జైళ్లలో మ్రగ్గుతున్న కమ్యూనిస్టు ఖైదీలను రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ఆంధ్రప్రజలు చేస్తున్న ఆందోళన పట్ల ప్రభుత్వ విధానాన్ని వ్యక్తంచేసే అంశం గవర్నరుగారి ప్రసంగంలో లేనందుకు మాత్రం ఆంధ్ర శాసనసభ విచారపడుతున్నది."

Sri N. V. L. Narasimha Rao :—Add the following at the end: "చేనేత పారిశ్రామికుల సర్వసేనానియు, ఆంధ్ర శాసనసభా సభ్య మహాశయులునగు శ్రీ ప్రగడ కోటయ్యగారిని గవర్నమెంటువారు బంధవిముక్తుని జేసినను, వారి అనుచరులైన వారందరినికూడ ఆ విధముగా వదలుటకు శ్రీ గవర్నరుగారికి గవర్నమెంటువారు సలహా నీయక పోవుట శోచనీయము."

Sri N. V. L. Narasimha Rao:—Add the following at the end: "మద్రాసులో నిలవ నీడలేకుండా చేయబడినను అక్కడనే యింకా ఆఫీసులువుంచి తరలింపు మార్గమును ఉదాసీనముగా ఆలోచించుట శ్రీ గవర్నరుగారి ఉపన్యాసములో యిదమిద్ధమని సూచన లేక పోవుట శోచనీయము."

Sri N. V. L. Narasimha Rao:—Add the following at the end: "శ్రీ గవర్నరుగారి ఉపన్యాసములో హైకోర్టుయొక్క స్థల నిర్ణయము సూచించకపోవుట శోచనీయము."

28th November 1953]

Sri Saka Venkata Rao:—Add the following at the end: "ప్రొహిబిషన్ విఫలమైనదని తెలిసికూడా దానిని ఉపసంహరించక యింకా వేలాది కల్లుగీత కార్మికులను నిరుద్యోగులుగా చేయుచూ, వారి భృతికి యితరవృత్తులు చూపకుండా కడకు విఫలమైన తర్వాతకూడ మొండిగా దానిని ఉపసంహరించకుండా యుండుటనుగురించి విచారించవలసి వస్తుంది."

Sri Saka Venkata Rao:—Add the following at the end: కోరంగి ప్రాజెక్టు దిగువ వేలాది యెకరాల భూమిని అనేక సంవత్సరాలుగా సాగుచేసుకుంటున్న పేద ప్రజానీకానికి పట్టాలివ్వకుండా వేరే రూపంలో ధనికులకే కట్టిబెట్టుటకు వేస్తున్న ప్లానుల గురించి విచారించవలసి వస్తుంది."

Sri Saka Venkata Rao:—Add the following at the end: "గోదావరి వరద బాధితులకు ప్రభుత్వం యిచ్చిన సహాయం అసలే చాలీచాలనిదిగా యుండుటయేగాక, అదికూడ సక్రమమైన పద్ధతులలో పంపకం చేయక ప్రభుత్వ ఆఫీసర్లు అసాములను ప్రజా వ్యతిరేకులకు పెత్తనం యిచ్చి పంపకం చేయించినందున అది సరిగా ప్రజలకు అందుటలేదని యెన్నో రిపోర్టులు చేసినా వాటిని పట్టించుకొననందుననూ, ప్రభుత్వంయొక్క అసమర్థతను గురించి విచారించవలసి వస్తుంది."

Sri Alluri Venkatarama Raju:—Add the following at the end: "తూర్పు గోదావరి జిల్లాలోని వరద నష్టం భూములకు (గండ్లు పడ్డచోట) నష్టపరిహారం యివ్వకపోగా మరెప్పుడూ సాగుకు పనికి రాకుండా గండ్లు పూడ్చుటకు త్రవ్వివేసినారు. దీనికి తక్షణం నష్టపరిహారంగా ప్రభుత్వ లంకభూమినిగాని డబ్బుగాని ఇవ్వాలి."

Sri Alluri Venkatarama Raju:—Add the following at the end: "ప్రభుత్వం లంకలు పాడుకున్నవారికి పూర్తి రెమిషను ఇచ్చుటగాని, కోరబడ్డ లంకలు తిరిగి పాటకుపెట్టిగాని సహాయపడాలి."

Sri Alluri Venkatarama Raju:—Add the following at the end: "మరమ్మతు చెయ్యబోయే పటిగట్టులు లేబరు సొసైటీలకు మాత్రమే ఇవ్వాలి."

[28th November 1953

Sri Garapati Satyanarayana:—Add the following at the end: కాని "శివాయ్‌జమా బంజరు భూములను గత 10, 15 సంవత్సరము లుగా సాగుచేయుచున్న వ్యవసాయకూలీలు, బీదరైతులకు పట్టాలు యివ్వ వలయునని పేర్కొనబడనందుకు విచారించుచున్నాను."

Sri Garapati Satyanarayana:—Add the following at the end: "కాని చాలాకాలంగా నివేశనస్థలములకొరకు ఆందోళన చేయుచూ, డిపాజిటుకూడ కట్టిననూ హరిజనులకు నివేశన స్థలములను యిప్పించుటలో ప్రభుత్వం విఫలత చెందినందుకు విచారించుచున్నాను."

Sri Garapati Satyanarayana:— Add the following at the end: "కాని పశ్చిమగోదావరి-కృష్ణా జిల్లాల మధ్యగల కొల్లేరులో అదనంగా 30 వేల ఎకరాలు సాగుకు అనుకూలించే ఉప్పుటేరుకు రెగ్యులేటరు నిర్మించుటలో ప్రభుత్వం పూనుకోనందుకు విచారించుచున్నాను."

Sri G. Joseph:—Add the following at the end: "కాని శివాయిజమా బంజరుభూములను గత 10, 15 సంవత్సరాలుగా సాగు చేయుచున్న వ్యవసాయ కూలీలకు పట్టాలు యివ్వవలయునని పేర్కొనబడనందుకు విచారించుచున్నాను."

Sri G. Joseph:—Add the following at the end: "కాని వ్యవసాయ కూలీలు అనేక సంవత్సరాలుగా సాగుచేసిన బంజరుభూములు రాజకీయ బాధితుల దురాక్రమణనుండి తిరిగి తొలగించి మొదట సాగు చేసిన కూలీలకే యిస్తామని పేర్కొనకపోవడం గురించి విచారించు చున్నాను."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "ఆంధ్రరాష్ట్ర స్వాతంత్ర్య విప్లవ పోరాటములో అసువులు బాసిన విప్లవ వీరుల కుటుంబాలకు నష్టపరిహారమును యిచ్చుటనుగురించి ఉదహరించ నందులకు విచారమును తెలియజేయడమైనది."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "భారత స్వాతంత్ర్య విప్లవ పోరాటములో [illegible] అసువులుబాసిన విప్లవవీరుల కుటుంబాలకు నష్టపరిహారము యిచ్చుటను గురించి ఉదహరించనందుకు విచారమును తెలియజేయడమైనది."

28th November 1953]

Sri D. Lakshmaiah:—Add the following at the end: "భారత స్వాతంత్ర్య విప్లవ పోరాటములో పాల్గొన్న వారిపై ప్రభుత్వం వారు పెట్టిన కేసుల్లో శిక్షలు వేసిన కేసులున్నా, కోర్టులలో జరుగుచున్న కేసులున్నా తీసివేయడమునుగురించి ఉదహరించనందుకు విచారమును తెలియజేస్తున్నాను."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "సాగుకు అనుకూలమైన ఫారెస్టు బంజరు భూములున్నా రెవిన్యూ బంజరు భూములున్నా వుచితముగా బీదలకు సాగుచేసుకొనుటకు యిచ్చుటను గురించి ఉదహరించనందుకు నా విచారమును తెలియజేయుచున్నాను."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "ఆంధ్రరాష్ట్రములో వ్యాపారపుపంట అయిన పొగాకును రైతులు ఎక్కువగా వుత్పత్తిజేసి విడుదలగాక రైతాంగం పడు యిబ్బందులను గురించి సరుకును యితర దేశములకు యెగుమతిజేసి రైతుల అమరకంజేసి కష్టములను తీర్చు మార్గమును ఉదహరించనందుకు నా విచారమును తెలియజేయుచున్నాను."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "అత్యధిక సంఖ్యాకులు విద్యలేక పోవుటవలన పొగాకు చుట్ట చట్ట నిబంధనలవలన రైతులు పొందుచున్న కష్టములను నివారించు పద్ధతులను గురించి వుదహరించనందుకు విచారమును తెలియజేయడమైనది."

Sri D. Lakshmaiah:—Add the following at the end: "మద్యపాన నిషేధ చట్టమువలన ప్రజానీకం అభివృద్ధియగుటకు బదులు కష్టనష్టములకు గురిఅవుచున్న మద్యపాన నిషేధచట్టమును రద్దుచేయుటను గురించి ఉదహరించనందుకు విచారమును తెలియజేయడమైనది."

Sri B. Lakshminarasa Raju:—Add the following at the end: "కాపురముండుటకు ఇండ్లులేని హరిజనులకు ఉచితముగా ఇండ్ల స్థలములు మంజూరు చేయుటలో తగిన శ్రద్ధచేయనందుకున్నూ,"

Sri B. Lakshminarasa Raju:—Add the following at the end: "షుమారు 15 సంవత్సరములనుండి భూమిలేని రైతులు సాగుచేసు

[Sri B. Lakshminarasa Raju] [28th November 1953

కొనుచున్న బంజరు భూములకు పట్టాలు ఇచ్చుటకు నిర్ణయం చేయనందు కున్నూ ప్రభుత్వముయొక్క అసమర్థతనుగురించి విచారించవలసివస్తోంది."

Sri R. V. Jagga Rao:—Add the following at the end: "పేరా నెంబరు 2, 5, 6, 8, మరియు 13 లో ఉపయోగించిన "My Government" కు బదులు (స్థానములో) "Andhra Government" అను సవరణను చేర్చవలెను."

Sri R. V. Jagga Rao:—Add the following at the end: "10 వ పేరా ఆఖరున ఈ క్రింది సవరణ చేర్చవలెను. (A)—మద్యపాన నిషేధ చట్టమును "ఆంధ్రప్రభుత్వము రద్దుచేయ నిశ్చయించింది."

Sri R. V. Jagga Rao:—Add the following at the end: "(B) వ్యవసాయ కూలీల కనీస వేతనములు నిర్ణయించుతూ ఒక చట్ట మును ప్రవేశపెట్టుటకు ఆంధ్రప్రభుత్వము నిశ్చయించింది."

Sri M. Kune Rao:—Add the following at the end: "యిందులో వరద నివారణోపాయములు యెత్తలేదు. శబరినది ఆనకట్ట, నది గట్లు బలంగా పెంచమని యింజనీర్ల సలహా, అమలు పర్చుతామని వుండాలి."

Sri M. Kune Rao:—Add the following at the end: "అధిక ఆహారపంట స్కీములు యెలా నిరుపయోగమైనది కనీసం ముందు కైనా మైనరు యిరిగేషను వర్కులు తప్పక పూర్తి చేస్తామని తెలియచేసి వుండవలసింది."

Sri M. Kune Rao:—Add the following at the end: విద్యుచ్ఛక్తి స్కీములు ఆకస్మికంగా లోగడ ప్రభుత్వం అపుటపట్ల నిర సనా, రైతాంగమునకు వాటిల్లిన నష్టాలను, నివారణోపాయములు మరల యెలా అమలు పర్చేదీ ప్రసంగములో తీసుకురావలసినది."

Sri M. Kune Rao:—Add the following at the end: "అటవీశాఖ ప్రయివేటుచట్టం యెందువల్ల వుంచాల్సిందీ కాస్త వివరించి వుండాల్సింది."

28th November 1953]

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారి ఉపన్యాసములో ఆంధ్ర రాజధానిని సాధ్యమైనంత తొందరలో, విజయవాడ-గుంటూరు ప్రాంతానికి మార్చివలసిన అవసరాన్ని పేర్కొననందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు, తమ ఉపన్యాసములో ఆంధ్రదేశ అభివృద్ధికి అత్యవసరమైన ఆంధ్ర పారిశ్రామిక అభివృద్ధిని గురించి చెప్పనందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో, బీదలైన వ్యవసాయ కూలీలు రైతులు సాగుచేసుకొంటున్న బంజరు భూములను పట్టాలకు ఇచ్చే విషయము తీసుకురానందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో వందల, వేల యకరాలను కష్టించి సాగు చేసుకొంటున్న ధర్మాదాయ భూములలో, సదరు సాగుదార్ల హక్కులను పేర్కొననందులకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"మైనరు పంచాయతీబోర్డు యెన్నికలను న్యాయంగా జరుగుటకున్నూ, సదరు బోర్డులు ప్రజాసేవ ఇతోధికంగా చేయుటకున్నూ అవసరమైన సవరణల విషయమును గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో తీసుకురానందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో తక్కువ జీతాలతో బాధపడుచున్న ప్రాధమిక ఉపాధ్యాయుల కష్ట, నిష్ఠూరాల గురించి తీసుకురానందున విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో, నూతన విద్యా విధానమువల్ల, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు వచ్చిన అవస్థల గురించి చెప్పనందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో, మద్యనిషేధమును రద్దుపరచవలసిన అవసరాన్ని పేర్కొననందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"గౌరవనీయులగు గవర్నరుగారు తమ ఉపన్యాసములో తక్కువ జీతాలతో ఎక్కువ పనిగంటలతో అవస్థపడే పోలీసు ఉద్యోగులకు సహాయపడవలసిన అవసరాన్ని గురించి పేర్కొన నందుకు విచారిస్తున్నాను."

Sri B. Sankarayya:—Add the following at the end:
"సెంట్రల్ పే కమీషన్ సిఫార్సులను ఆంధ్రలో ప్రభుత్వ ఉద్యోగులకు కార్మికులకు అనువర్తింప జేయవలసిన అవసరాన్ని గౌరవనీయులైన గవర్నరుగారు తమ ఉపన్యాసములో చెప్పనందుకు విచారిస్తున్నాను."

Mr. Speaker: I shall now put the main resolution to the vote of the House. It reads thus:

"That an humble Address be presented to His Excellency the Governor as follows:-

"May it please Your Excellency, We, the Members of the Andhra Legislative Assembly beg leave to thank Your Excellency for the Address delivered to the House on the 24th November 1953."

The motion was carried.

**Mr. Speaker**:—This resolution will be conveyed to the Governor.

## POINT OF ORDER RE: PROMULGATION OF SECTION 144 CR. P. C.

**Sri V. Chidanandam**:— నిన్న హోము మంత్రిగారు 144 Section జారీ చేయవలసినదిగా ఉత్తరువులు ఇచ్చారు. దానివల్ల ఏలాంటి బహిరంగసభ జరగకూడదు. మేము ఇక్కడ జరిగిన ఉదంతాలు ప్రజ

28th November 1953] [Sri V. Chidanandam]

లను తెలియజేయకపోతే చాలా చిక్కులు వస్తాయి. అలజడి ఎక్కువవు తుంది. అందువల్ల మీరంగానైనా బహిరంగసభ జరుపుకొనుటకు ఉత్తరువులు ఇస్తారా? అల్లా ఉత్తరువులు ఇచ్చింది నిజమేనా? ఇస్తే వాటిని రద్దు చేసి బహిరంగసభకు అనుమతి ఇస్తారా?

Mr. Speaker:—యీ విషయం నేనుకూడా సూచించాను.

The Hon. Sri N. Sanjeeva Reddi:—మీరు సూచించిన తరువాత ఈ పట్టణంలో అల్లర్లు జరుగుతాయని Section 144 ప్రయోగింపబడింది. ఇప్పుడు పరిస్థితులు ప్రశాంతంగా ఉన్నాయి. యీ పట్టణంలో పెద్దలు కొందరు ఇప్పుడు నా దగ్గరకు వచ్చి ప్రశాంతమైన పరిస్థితులలో ఒక మీటింగు జరుపుకొనుటకు అవకాశం కోరారు. కాని ఏ ప్రాంతంలో 144 Section అమలులో ఉన్నదీ, ఏ భాగంలో అమలులో లేదో తెలియదు. అక్కడ మీటింగు పెట్టుకోటానికి ఉత్తరువులు లేవు. అక్కడ కూడా ఉత్తరువులు తీసుకునే పెట్టాలికాని, అదికూడా ప్రశాంతంగా చర్చ జరుపుటకు తోడ్పడవలసిందని చెప్పాను. ఇప్పుడే పెద్దలకు చెప్పి పంపినాను. కనుక, పెద్దలు సరియైన అధికార్ల దగ్గరకు వెళ్లి ఉత్తరువులు తీసుకుని సభ జరుపుకొనుటకు యీ Section అమలులోలేని ప్రాంతాలలో సభ జరుపుకొనుటకు ఉత్తరువులు తీసుకొని జరుపవచ్చును. ఆ సమావేశానికి నేను కూడా వస్తాను అని చెప్పాను. వచ్చుటకు సిద్ధంగా యున్నానని చెప్పాను.

## MESSAGE FROM THE GOVERNOR

Mr. Speaker:—The House will now proceed to the next item in the agenda.

I have received the following message dated 18th November 1953 from the Governor of the State of Andhra:

"In pursuance of Article 207, clause (3), of the Constitution of India, I, C. M. Trivedi, Governor of Andhra, hereby recommend to the Andhra Legislative Assembly the consideration of the Andhra Payment of Salaries and Removal of Disqualifications Bill, 1953."

Besides this Bill there are two other Bills, namely, The Madras Preservation of Private Forests (Andhra Amendment) Bill, 1953 and the The Madras State Co-oper-

[Mr. Speaker] [28th November 1953

ative Societies (Reconstitution and Formation) Bill, 1953. They are of a formal nature and it may not take much time for the House to pass them.

Sri T. Nagi Reddi :—అధ్యక్షా ! యీ దినం మనం మూడు బిల్లులు తీసుకోవడం జరుగుతోందని మాకు తెలియదు. ఒక బిల్లు urgent గా pass కాకపోతే lapse అవుతుందని తెలిసింది. దీన్ని శీఘ్రంగా యీ దినం చర్చించి మిగతావి దాని తర్వాత తీసుకుంటే సరి పోతుంది. ఈ రభసలో పడి వాటిని చూచిన పాపాన్ని పోలేదు. అందు వల్ల మాకు అనుకూలంగా ఉంటుంది. ఆ విధంగా చేయమని కోరు తున్నాను.

Mr. Speaker :—I have no objection to take up the Madras Preservation of Private Forests (Andhra Amendment) Bill, 1953, first—

## GOVERNMENT BILLS.

### THE MADRAS PRESERVATION OF PRIVATE FORESTS (ANDHRA AMENDMENT) BILL, 1953.

The Hon. Sri K. Koti Reddi :— I move : "That the Madras Preservation of Private Forests (Andhra Amendment) Bill, 1953 be taken into consideration."

అధ్యక్షా ! యీ బిల్లుకు అవసరం వచ్చింది. ఇదివరకు ముందున్న చట్టం ప్రకారం అడవులయొక్క స్వంతదార్లు ఏ విధంగా చేసినప్పటికి ఆక్షే పణ లేకుండా ఉంది. అందువల్ల forest లు నాశనం చేస్తారని 1949 సంవత్సరంలో ఒక చట్టం జరిగింది. ఇదివరలో అడవులు కలిగినటువంటి వారు, అనగా ముఖ్యంగా జమీందార్లు ఎస్టేట్లలో ఉండేవారు అడవులను పాడుచేస్తూ వచ్చినారు. బొగ్గులకూ, కట్టెలకూ అమ్ముకోవడం జరుగుతూంటే, అందుపైన హెచ్చుగా నాశనం చేయకుండా క్రమపద్ధతిలో గవర్నమెంటు **Indian Forest Act** రూల్సు ప్రకారం ఏ విధంగా జరగవలెనో ఆ విధంగా జరుగుటకు ఒక చట్టం చేశారు. అదే మొదటిసారి చట్టం చేయడం. పిమ్మట దానిని రెండుసార్లు పొడిగించారు. ఇప్పుడు డిసెంబరు 2 వ తేదీకి ఇదివరకు చేసిన చట్టం అమలు ఆఖరవుతుంది. ఇంకో సంవత్సరం పొడిగించాలని యీ బిల్లు ఉద్దేశం. అట్లా లేనట్లయితే స్వంతదార్లు వారి ఇష్టంవచ్చినట్లు

28th November 1953] [The Hon. Sri K. Koti Reddi]

forest నాశనం జేయవచ్చు. కనుక ఒక పద్ధతి ప్రకారం కలెక్టరు పర్మిషన్‌తో అడవులను ఉపయోగించాలని, ఇంకా ఒక సంవత్సరం కాలం పొడిగింపు కావాలని ఈ బిల్లు తీసుకువచ్చాం. ఇది ఏమీ వివాదాస్పద విషయంకాదు. ఆక్షేపణలేకుండా ఒప్పుకుంటారని ఆశిస్తున్నాను.

Mr. Speaker :—The motion is :

> That the Madras Preservation of Private Forests (Andhra Amendment) Bill 1953 be taken into consideration.

* Sri Vavilala Gopalakrishniah :— అధ్యక్షా, మంత్రిగారు ఉపపాదించిన బిల్లుకు నా సవరణ ఒకటి వున్నది. అది ఏమిటంటే సెలక్టు కమిటీకి పంపమని. Zamindari Abolition Act ను అనుసరించి కొన్ని జమీందారీలు ప్రభుత్వ స్వాధీనం అయినందువల్ల మిగిలిన జమీందారీలకు సంబంధించిన అడవుల విషయమై ఈ బిల్లు తీసుకువచ్చారు. జమీందారీలను రద్దుచేయ దలచుకొన్నారు. కొన్ని జమీందారీలను మాత్రం అభిమానం వుండడంవల్ల, ఏవో నిర్ణయాలవల్ల రద్దుచేయలేకపోతున్నారు. Technical fault వల్ల అమలు జరపడం లేదు అంటారు. దీన్ని వెంటనే జమీందారీ రద్దు బిల్లుతో అమలుజరపాలి అని కోరుతున్నాను. దాని క్రిందకి వచ్చేవి ఎన్ని జమీందారీలు వున్నాయి? వీట్లన్నింటిని సావకాశంగా చర్చించుకునే నిమిత్తం నేను ఈ సవరణను ప్రతిపాదిస్తున్నాను. "That the Bill be referred to the Select Committee" బిల్లును సెలక్టుకమిటీకి పంపించవలెను అని.

* Sri P. Pundarikakshacharyulu:—శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారి సవరణను నేను బలపరుస్తున్నాను. ఈ చట్టం మద్రాసులో 1949 వ సంవత్సరంలో పాసు అయింది. అప్పటినుంచి ప్రతి సంవత్సరం పొడిగింపబడుతోంది. సరిగ్గా అమలు జరుపకపోవడంవల్ల జమీందారులు అనేకమైన దుండగములుచేస్తూ, బంజరు భూములను, forest లను అన్యాక్రాంతం చేస్తుంటే, ఆ విషయాన్ని ప్రభుత్వానికి ఎప్పటికప్పుడు శాసన సభలలోనూ అర్జీలద్వారానూ తెలియచేస్తున్నప్పటికి ఏమీ చర్య తీసుకో లేదు. ఏదో ఆచారంగా ఈ బిల్లును ప్రతిపాదించడమే తప్ప విషయాలన్నింటిని ప్రభుత్వం శాసన సభ ఎదుట పెట్టడంలేదు. ఈ పరిస్థితుల్లో దీన్ని

ఇప్పుడు పోడిగించవలసిన అవసరంలేదు. ఇంకా కొన్ని estates రద్దు కాకుండా వున్నాయి. అందుచేత ఈ బిల్లు అవుసరం అంటున్నారు. మా విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లోనే మాడుగుల, జైపూరు కుమారికా, పర్లాకిమిడి, కురుపాం estates వున్నాయి. ఇవి అనగా పర్లాకిమిడి, కురుపాంలు కలాపు లక్ష్మణదాసుగారి నియోజకవర్గంలో వున్నాయి. అందువల్ల ప్రజలు బాధపడిపోతున్నారు. ఈ విషయాన్ని లక్ష్మణదాసుగారు కూడా అనేక అర్జీలద్వారా ప్రభుత్వానికి తెలియపరచి వున్నారు. లక్ష్మణదాసుగారు గవర్నరుగారి Address లో అనేక విషయాలుగురించి చెప్పారు కాని వీరి నియోజకవర్గంకు సంబంధించిన ఈ ముఖ్య సమస్యగురించి చర్చించకపోవడం చాలా ఆశ్చర్యంగా వున్నది. ఇప్పుడు ఆ estates ను ఏదో High Court Order వుండడంవల్ల తీసుకోలేదని చెప్పారు. ఇపుడు ఆ orders vacate అయిపోయినాయి. ఈ బిల్లును తీసుకువచ్చి ఇలాంటి estates ఇంకా వుంచాలని యత్నం చేసేదానికన్న ఆ estates ను రద్దు చేయవచ్చునని, ఈ బిల్లు అప్పుడు అవసరంగా వుండదని మనవి చేస్తున్నాను. ఇటువంటి బిల్లును ప్రవేశపెట్టడంవల్ల ఇటువంటి estates ను ఇంకా రద్దు చేయకుండా వుంచుతారేమో అనుకోవలసి వస్తుంది. అందుచేత ఈ బిల్లు అవసరంలేదని మనవి చేస్తున్నాను.

**Mr. Speaker**: The motion before the House is:
That the Bill be referred to a Select Committee.

**Sri L. Lakshmana Das**:—ఇంతకుముందువారు కొన్ని estates రద్దుకాకపోవడంగురించి మాట్లాడారు, దాన్నిగురించి నేను మాట్లాడలేదని చెప్పారు. ఈ రెండు estates సంబంధించినంతవరకు High Court లో writ మూలంగా వాటిని అధికారంలోకి తీసుకోకుండా ఆపివేయబడింది. అందుచేత వాటిని అధికారంలోనికి తీసుకోకపోవడం ప్రభుత్వ అశ్రద్ధకాదని తెలియుడంచేత, హైకోర్టు అభ్యంతరం వుండడంబట్టి ఏ చర్య తీసుకునేందుకు వీలులేదని తెలియడంచేతనే వాటిని గురించి నేను మాట్లాడకుండా ఊరుకున్నానని తెలియచేస్తున్నాను.

* **Sri K. Govinda Rao**:—అధ్యక్షా, ఈ బిల్లు తీసుకు రావడంలో గల ఉద్దేశాన్ని ప్రభుత్వం తరఫున రెవిన్యూ మంత్రిగారు తెలియ చేశారు.

ఈ బిల్లు తీసుకురావడానికి మాకు ప్రత్యేకంగా అభ్యంతరం ఏమీ లేదు. జమీందారీల్లో వుండే అడవులను ఎవరైనా నాశనం చేస్తే ఆ అడవులను ప్రభుత్వంవారు వశపరచుకొనే హక్కుకోసము ఈ బిల్లును తీసుకు వచ్చారను కుంటాను. దీనిని Select Committee కి పంపాలి అనే సవరణకు నేను వ్యతిరేకం. ఈ బిల్లు pass అయి, రెండవ తారీఖు డిసెంబరు లోపుగా President assent కావలసి వుంటుంది. ఈ బిల్లు pass చేయడానికి అభ్యంతరంలేదు, కాని ఈ బిల్లు ఒక సంవత్సరంపాటు వుండాలి అని ప్రభుత్వ బిల్లులోవుంది. నా వుద్దేశం ఏమిటంటే, అంత దూరం అవసరంలేదని, ఈ లోగా 6 నెలలలోగానే High Court లో writ విషయం తేలిపోతుందని, అందుచేత 6 నెలలకు కావలసిన అధికారం ప్రభుత్వానికి వుంటే చాలును అని అనుకుంటున్నాను. ఈ రకమైన హామీ ఇస్తే మా అభ్యంతరం ఏమీ లేదు. ఈ సందర్భంలో మరొకవిషయం మనవి చేయదలచుకున్నాను. అడవుల్లో contractors schedule rates అనుసరించడం లేదని ముఖ్యంగా మా విశాఖపట్నం జిల్లాలో దాదాపు ప్రతిచోట contractors నెదురురేటు విషయంలో చాలా అక్రమంగా వుంటున్నారని తెలియచేస్తున్నాను. బిల్లు విషయంలో మా అభ్యంతరం లేదని మంత్రిగారికి కూడా 6 నెలల గడువు అంగీకారంగా వుంటుందని అనుకుంటాను.

* **Sri G. Yellamanda Reddi:**—అధ్యక్షా, శ్రీ గోవిందరావుగారి యొక్క సలహాను బలపరుస్తున్నాను. ఎందుకంటే 6 నెలలు చాలు అనే నా అభిప్రాయము. ఈ నాడు ప్రభుత్వం estate forests తీసుకొన్న తరువాత అనేక యిబ్బందులు కలుగుతున్నాయి. ఇంతవరకు నెల్లూరు జిల్లాలో వెంకటగిరి estate forest లో నున్న రైతాంగం యిబ్బందులను ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చాం. సాగుచేసే భూములుతప్ప తక్కినవన్నీ రిజర్వులుగా ప్రకటించటమువలన estate రైతాంగానికి విపరీతమైన యిబ్బందులు ఏర్పడుతున్నాయి. ఇప్పుడు estate forest లలో పశువులు, గొర్రెలు, మేకలు బయటికి పోవుటకు వీలులేకుండా పరిస్థితులు ఏర్పడినాయి. ఈ బిల్లును సవరణచేస్తే రైతాంగానికి యిబ్బందులు ఏర్పడుతవి. Reserve forests ఏ per cent నిర్ణయించాలి? మద్రాసు గవర్నమెంటు 100 ఎకరాల భూమి సాగు అవుతున్నట్లయితే 30 ఎకరాలు బంజరు నిర్ణయం చేసినది. ఆంధ్రరాష్ట్రంలో ఎంత per cent భూమి మినహాయించాలి అన్న

[Sri G. Yellamanda Reddi] [28th November 1953

విషయంలో ఈనాడుకూడా మన government కు ఒక నిర్దుష్టమైన policy లేనందువల్ల రైతాంగానికి యిబ్బంది కలుగుతోంది. ఎస్టేట్సునుంచి తీసుకున్న అడవులలో ఆ రైతాంగానికున్న హక్కులు నిర్వచింపబడాలి. Settlement Officerలను ప్రభుత్వం నియమించాలి. బ్రహ్మాండమైన ఆ పనికి 1½ సంవత్సరాలు కార్యక్రమం తీసుకుంటుంది. ఈ రెండు సంవత్సరాల లోపుగా యీ estate రైతాంగం సాగుచేసే భూములుతప్ప తక్కిన భూములన్నీ రిజర్వులుగా పరిగణిస్తే పశువులు మేకలు గొర్రెలు బయటికి పోకుండా ఎక్కడ వుంటాయి? ఈనాడు ఫారెస్టు ప్రాంతాల్లో ప్రజలు చాలా యిబ్బందులకు లోనవుతున్నారు. ఫారెస్టుకు సంబంధించిన వాచరు సైతం గ్రామసీమల్లో పెద్దఅధికారం చెలాయిస్తున్నాడు. Estate లను ప్రభుత్వ ఆధీనంలో తీసుకున్నప్పుడు ఆ estate అడవులలో రైతాంగాని కున్న హక్కులను రక్షిస్తామని సమిష్టి మద్రాసు రాష్ట్రంలో శ్రీనాగన్న గౌడుగారు హామీయిచ్చారు. హామీ అంటే యిచ్చారుగాని ఆ హక్కు లంటే ఏమిటో clear గా నిర్వచించలేదు. రైతులు తమకున్నవని చెప్పే హక్కులను ప్రభుత్వం గుర్తించాలి. Estate లోని రైతులు చాలా వెనుక బడ్డారు గనుక వారి విషయం శ్రద్ధవహించాలని మీ ద్వారా మనవి చేస్తు న్నాను. Estate forests విషయంలో ప్రభుత్వ policy గురించి ఒక ప్రక టన జారీ చేయడం చాలా అవసరం. Percentage నిర్ణయించవలసిన అవ సరం వున్నది. Settlement చేయవలసిన అవసరం వున్నది. Forest guard లు రైతాంగాన్ని చాలా కష్టాలు పెడుతున్నారు. ఉదాహరణకు కంద్రిక గ్రామం తీసుకోండి.

ఈ ordinance తీసుకు రావడం సంతోషించ వలసినదే. కాని చిక్కుల విషయంలో సబబుగా ఒక policy లేకపోతే యిబ్బందులు వస్తాయని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. నెల్లూరు జిల్లాలోని estate రైతుల చిక్కులను వివరిస్తూ ఒక రాయబారవర్గం మా జిల్లానుంచి వచ్చింది. ప్రభుత్వమువారు estate forest విషయంలో నేను చెప్పిన వాటిని గమనించి line ల విషయంలో తగుచర్యలు తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

**The Hon. Sri G. Latchanna:**—అధ్యక్షా! ఈ బిల్లు ముఖ్యంగా estateలో నున్నటువంటి private forest లకు సంబంధించినది. జమీందారీల

28th November 1953] [Sri G. Latchanna]

రద్దు శాసనం అమలులోకి రాకుండా High Court, Supreme Court లలో జమీందారులు వేసిన writ petition లు యింకా dispose కాకపో వడంచేత జమీందార్లు తమ జమీందారీలోని అడవులను కొట్టించి బంజర్లుగా మార్చి యితరులకు దత్తం చేయకుండా estate లోని అడవులను రక్షించే నిమిత్తం ఏర్పడిన బిల్లు యిది. గవర్నమెంటు ఆదాయం విషయం కాబట్టి సభ్యులు దీనిని బలపరచాలని కోరుతున్నాను. Estate లు ప్రభుత్వాధీనం కాగానే estate forest లు కూడా ప్రభుత్వ forest లోకి తీసుకొని, forest పరిపాలన విధానంలోవున్న లోపాలను, ప్రజలకు కలుగుతున్న కష్టాలను తొలగించుటకు తగిన చర్యలు తీసుకుంటామని హామీగా యిస్తున్నాను. కాబట్టి యీ బిల్లును అందరు ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాను.

* Sri K. Krishna Rao:—యీ బిల్లులో forests యొక్క definition చూస్తే, యీ బిల్లు, జమీందారీ, యీనాందారీ గ్రామాలలో వుండే, సమిష్టి పశువుల బీళ్ళు, కంచెలకు వర్తిస్తుందని తెలుస్తుంది. యీ విధమైన గ్రామాలలో జమీందార్లు, పెద్ద యీనాందార్లు కంచెలను తమస్వంత భూములుగా మారుస్తున్నారు. ట్రాక్టర్లుపెట్టి దున్నిస్తున్నారు. వీనిగూర్చి, రైతులు అర్జీలు పెట్టుకుంటే, దానిపై తగినచర్య, రెవెన్యూ అధికార్లు తీసికోవడంలేదు. యీ విషయంగూర్చి, లోగడ Madras Legislative Assembly లో, ప్రశ్న వేస్తే, ఆవిషయంపై, రైతులు కోర్టు లలో దావాలు చేసుకోవచ్చుని, ఆ ప్రశ్న disallow చేశారు.

ఈ రోజువరకు సాధారణంగా ఈనాందారులు, జమీందార్లు ధాన్యం ధరలు హెచ్చుగా వున్నందువల్ల ఎక్కువ డబ్బుకలవారు కావడంవల్ల అనా ధీనం భూములను, అక్రమంగా తమ స్వంతభూములుగా మార్చుకొంటూ వున్నారు. యీ అక్రమ ఆక్రమణపై కేసులుపెట్టి, యీ అక్రమాన్ని అరి కట్టించేందుకు, తగినంత స్తోమత తగినబలం లేకుండా ఉన్నారు రైతులు. దీన్ని సక్రమంగా పరిపాలించే బాధ్యత ప్రభుత్వానిదే. రెండవ దేమంటే చాలా విచిత్రమైనటువంటి విషయాలు తెలుస్తున్నాయి. ఎస్టేట్ ఆఫీసుల్లో ఉండేటటువంటివాళ్ల పేరున కొన్ని పట్టాలు అక్రమంగా, కొన్ని అనాధీ నాలు ఏర్పాటైనవని నేను విన్నాను. ఇటువంటి పట్టాలు కొన్ని చోట్ల ఎస్టేట్ మేనేజర్లు వాళ్ల ఆఫీసులో ఉండే వాళ్ల పెళ్లాలపేరున, వాళ్ల చుట్టాల

[Sri G. Yellamanda Reddi] [28th November 1953

విషయంలో ఈనాడుకూడా మన government కు ఒక నిర్దుష్టమైన policy లేనందువల్ల రైతాంగానికి యిబ్బంది కలుగుతోంది. ఎస్టేట్సునుంచి తీసుకున్న అడవులలో ఆ రైతాంగానికున్న హక్కులు నిర్వచింపబడాలి. Settlement Officer లను ప్రభుత్వం నియమించాలి. బ్రహ్మాండమైన ఆ పనికి 1½ సంవత్సరాలు కార్యక్రమం తీసుకుంటుంది. ఈ రెండు సంవత్సరాల లోపుగా యీ estate రైతాంగం సాగుచేసే భూములుతప్ప తక్కిన భూములన్నీ రిజర్వులుగా పరిగణిస్తే పశువులు మేకలు గొర్రెలు బయటికి పోకుండా ఎక్కడ వుంటాయి? ఈనాడు ఫారెస్టు ప్రాంతాల్లో ప్రజలు చాలా యిబ్బందులకు లోనవుతున్నారు. ఫారెస్టుకు సంబంధించిన వాచరు సైతం గ్రామసీమల్లో పెద్దఅధికారం చెలాయిస్తున్నాడు. Estate లను ప్రభుత్వ ఆధీనంలో తీసుకున్నప్పుడు ఆ estate అడవులలో రైతాంగానికున్న హక్కులను రక్షిస్తామని సమిష్టి మద్రాసు రాష్ట్రంలో శ్రీనాగన్నగౌడుగారు హామీయిచ్చారు. హామీ అంటే యిచ్చారుగాని ఆ హక్కులంటే ఏమిటో clear గా నిర్వచించలేదు. రైతులు తమకున్నవని చెప్పే హక్కులను ప్రభుత్వం గుర్తించాలి. Estate లోని రైతులు చాలా వెనుకబడ్డారు గనుక వారి విషయం శ్రద్ధవహించాలని మీ ద్వారా మనవి చేస్తున్నాను. Estate forests విషయంలో ప్రభుత్వ policy గురించి ఒక ప్రకటన జారీ చేయడం చాలా అవసరం. Percentage నిర్ణయించవలసిన అవసరం వున్నది. Settlement చేయవలసిన అవసరం వున్నది. Forest guard లు రైతాంగాన్ని చాలా కష్టాలు పెడుతున్నారు. ఉదాహరణకు కంద్రిక గ్రామం తీసుకోండి.

ఈ ordinance తీసుకు రావడం సంతోషించవలసినదే. కాని చిక్కుల విషయంలో సబబుగా ఒక policy లేకపోతే యిబ్బందులు వస్తాయని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. నెల్లూరు జిల్లాలోని estate రైతుల చిక్కులను వివరిస్తూ ఒక రాయబారవర్గం మా జిల్లానుంచి వచ్చింది. ప్రభుత్వమువారు estate forest విషయంలో నేను చెప్పిన వాటిని గమనించి line ల విషయంలో తగుచర్యలు తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

**The Hon. Sri G. Latchanna:**—అధ్యక్షా! ఈ బిల్లు ముఖ్యంగా estate లో నున్నటువంటి private forest లకు సంబంధించినది. జమీందారీల

28th November 1953] [Sri G. Latchanna]

రద్దు శాసనం అమలులోకి రాకుండా High Court, Supreme Court లలో జమీందారులు వేసిన writ petition లు యింకా dispose కాకపో వడంచేత జమీందార్లు తమ జమీందారీలోని అడవులను కొట్టించి బంజర్లుగా మార్చి యితరులకు దత్తం చేయకుండా estate లోని అడవులను రక్షించే నిమిత్తం ఏర్పడిన బిల్లు యిది. గవర్నమెంటు ఆదాయం విషయం కాబట్టి సభ్యులు దీనిని బలపరచాలని కోరుతున్నాను. Estate లు ప్రభుత్వాధీనం కాగానే estate forest లు కూడా ప్రభుత్వ forest లోకి తీసుకొని, forest పరిపాలన విధానంలోవున్న లోపాలను, ప్రజలకు కలుగుతున్న కష్టాలను తొలగించుటకు తగిన చర్యలు తీసుకుంటామని హామీ యిస్తున్నాను. కాబట్టి యీ బిల్లును అందరు ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతున్నాను.

* Sri K. Krishna Rao:—యీ బిల్లులో forests యొక్క definition చూస్తే, యీ బిల్లు, జమీందారీ, యీనాందారీ గ్రామాలలో వుండే, సమిష్టి పశువుల బీళ్ళు, కంచెలకు వర్తిస్తుందని తెలుస్తుంది. యీ విధమైన గ్రామాలలో జమీందార్లు, పెద్ద యీనాందార్లు కంచెలను తమస్వంత భూములుగా మారుస్తున్నారు. ట్రాక్టర్లుపెట్టి దున్నిస్తున్నారు. వీనిగూర్చి, రైతులు అర్జీలు పెట్టుకుంటే, దానిపై తగినచర్య, రివెన్యూ అధికార్లు తీసికోవడంలేదు. యీ విషయంగూర్చి, లోగడ Madras Legislative Assembly లో, ప్రశ్న వేస్తే, ఆవిషయంపై, రైతులు కోర్టు లలో దావాలు చేసుకోవచ్చుని, ఆ ప్రశ్న disallow చేశారు.

ఈ రోజువరకు సాధారణంగా ఈనాందారులు, జమీందార్లు ధాన్యం ధరలు హెచ్చుగా వున్నందువల్ల ఎక్కువ డబ్బుకలవారు కావడంవల్ల అనాధీనం భూములను, అక్రమంగా తమ స్వంతభూములుగా మార్చుకొంటూ వున్నారు. యీ అక్రమ ఆక్రమణపై కేసులుపెట్టి, యీ అక్రమాన్ని అరికట్టించేందుకు, తగినంత స్తోమత తగినబలం లేకుండా ఉన్నారు రైతులు. దీన్ని సక్రమంగా పరిపాలించే బాధ్యత ప్రభుత్వానిదే. రెండవ దేమంటే చాలా విచిత్రమైనటువంటి విషయాలు తెలుస్తున్నాయి. ఎస్టేట్ ఆఫీసుల్లో ఉండేటటువంటివాళ్ల పేరున కొన్ని పట్టాలు అక్రమంగా, కొన్ని అనాధీనాలు ఏర్పాటైనవని నేను విన్నాను. ఇటువంటి పట్టాలు కొన్ని చోట్ల ఎస్టేట్ మేనేజర్లు వాళ్ల ఆఫీసులో ఉండే వాళ్ల పిల్లలపేరున, వాళ్ల చుట్టాల

[Sri K. Krishna Rao] [28th November 1953

పేరుమీద చేర్చబడ్డాయనికూడా తెలుస్తూంది. ఈ విధంగా, Estate office లో వున్న ఆఫీసర్ల పేరనే పట్టాలు పుట్టబడివున్నందున, యిట్టి అనాధీనపు భూములను, అక్రమంగా పట్టాభూములుగా చేర్చారని చెప్పి, ఆ పట్టాలను set aside చేయడానికి తగినన్ని వీలులేకుండా వుంటున్నాయి. ఈ విధంగా దేశంలోని అనాధీనాలు క్రమంగా గవర్నమెంటు వుద్యోగస్తులకు అక్రమంగా సంక్రమించే అవకాశం వుంది.

**Mr. Speaker** :—గౌరవనీయులైన సభ్యులకు నేను సూచించే దేమంటే ఇప్పుడు మన ఎదుట ఉన్నట్టి బిల్లుయొక్క సవరణలు ఏమంటే ఎవరు చెప్పినా, ఉంటున్నా, జరుగుతున్న కష్ట నష్టాలు అవి అన్నీకూడా ఇక్కడ చెప్పితే మన హౌస్‌యొక్క టైము చాలా important అయింది.

**Sri M. Hanumantha Rao** :—Point of explanation. అధ్యక్షా! నా మనవి ఒకటుంది. ఈ బిల్లును పొడిగించాలంటే చాలా ఆలోచించవలసి ఉంటుంది. దాన్ని అధ్యక్షులవారి దృష్టికి తెస్తున్నాను.

**Sri K. Krishna Rao** :— ఒక బిల్లుగూర్చి చర్చ జరుగుతూం దంటే, దీనివల్ల ఎట్టి ఫలితాలు పొందగలరు? అనే విషయంగూర్చి చెప్పడం, చాలా relevant గా వుంటుంది. యీ విధంగానే, మద్రాసు శాసనసభలో లిగ్నైటు బిల్లు మొదలగు బిల్లులపై చర్చ జరుగుతూన్న ప్పుడు, మాట్లాడడం జరిగింది. అదేవిధంగా యీ బిల్లు చర్చలో వున్న ప్పుడు, దీనివల్ల ఏర్పడినటువంటి, ప్రజలు పొందినటువంటి అనుభవాలు చెప్పడానికి యిది వక అవకాశం. అందువల్ల యీ బిల్లువల్ల జమీందారీ, యీనాందారీ గ్రామాలలోని రైతులు పడుతూన్న కష్టాలగూర్చి చెబు తూన్నాను. యీవిధంగా రైతులు పడే అవస్థలుండగా, యీ బిల్లువల్ల జమీందారీ, యీనాందారీ రైతులు పొందవలసిన సౌకర్యం పొందలే కున్నారు. అందుకు యీ విషయాలు కొంతవరకు తెలిసిన లచ్చన్నగారి వంటివారు వున్నారు. కాబట్టి యీ బిల్లుయొక్క ఆచరణలో రైతుల యొక్క సౌకర్యాలను దృష్టిలో పెట్టుకోవడం జరుగుతుందని నమ్ముతున్నా. ఈ బిల్లును extend చేయడానికి.........

28th November 1953]

Mr. Speaker.—Hon. Members should remember that we are not to discuss here the necessity or otherwise of this measure.

తమ ముందున్న దేమంటే ఈ బిల్లును పొడిగించడమా లేదా అన్నదే.

Sri R. Siddanna Gowd:—అధ్యక్షా! ఈ ఎస్టేట్ ఫారెస్టు గవర్నమెంటువారి స్వాధీనంకాక రైతులు అనుభవించే హక్కులు ఇప్పుడుకూడా అనుభవించేట్లు చేయాలి. అక్కడ ఉండే వంటచెరకు, పశువులను మేపుకోడానికి రైతులకు అనువైన సౌకర్యాలు కల్పించాలి. జమీందారులనుండి వారి హక్కులను రక్షించాలి. ఈ బిల్లును పాస్ చేయడంలో ఏమీ ఆక్షేపణ లేదు.

Mr. Speaker:—ఎవరైనా గౌరవ సభ్యులు మాట్లాడ తలుచుకుంటే చెప్పితే బాగుంటుందని నేను అనుకుంటున్నాను.

Sri C. Ramalingayya:—ఈ బిల్లును నేను కొంతవరకు ఆమోదిస్తున్నాను. కొంతవరకు వ్యతిరేకిస్తున్నాను. 1949 బిల్లు ఒకటవ సెక్షన్, రెండవ సబ్ సెక్షన్‌లో ఏమంటే మొత్తం ఈ ఆక్టు అంతాకూడా మనం పొడిగించడానికి ఈ బిల్లు పెట్టారు. ఈ ఒకటవ సెక్షన్, రెండవ సబ్ సెక్షన్ పాస్ చేయడానికి మనకు జూరిస్ డిక్షన్ లేదు.

The Hon. Sri T. Viswanatham:—అధ్యక్షా! మా అడ్మినిస్ట్రేషన్ ఆర్డర్లో ఇదివరకు జూరిస్‌డిక్షన్ చాలావరకు పబ్లిష్ అయినా మిగిలినవి కూడా పబ్లిష్ ఔతున్నాయి. రెండవది, ఈ ఓనర్సుపై యజమానులకు, జమీందారీలలోకూడా పాత ఆక్టు ప్రకారం గవర్నమెంట్ చేతుల్లోకి అవి వస్తాయి. అందుచేత గవర్నమెంట్ ఆలస్యం చేస్తారని అనుకో నవసరం లేదు. తనకు ఉన్నటువంటి హక్కులను తీసుకోలేదుకదా అని చెప్పడం కోసం అందుకని చెప్పి రెండు మూడు పర్యాయాలు అధ్యక్షులవారు చెప్పారు. లచ్చన్నగారుకూడా చెప్పారు. Administration బాగాలేదని చెప్పారు. తెలియనటువంటివాళ్లు ఈ వైపు కూర్చోలేదు. వెంటవెంటనే ఆర్డర్సు పాస్‌చేయలేదని లచ్చన్నగారు అంటే ఎలా నేను మనవి చేసేది? ఈ Act పాస్ చేయాలని కోరినట్లైతే తిరిగి ఇది మరొకసారి అసెంబ్లీముందు

[The Hon. Sri T. Viswanatham] [28th November 1953

రాకుండా ఉండాలి. మేము చెపుతున్న విషయాలు మీరు చాలా చెప్పారు. ఈ Act ఇలా వెళ్ళడంవల్ల ఏమైనా నష్టం ఉంటుందా?

Sri K. Veeranna Padal :—ఈ బిల్లు వర్తింప చేయడానికిముందు దానికి అది suitable area అగునో కాదో అని చూడాలి. Jaipur Estate మాత్రం India Government అధికారంలో వున్నను, Madras Government Agency Officer కు వారు తీర్మానించి Jaipur estate మాత్రము ఆ విధముగా తీర్మానము చేసుకొనినారు. ఆ తీర్మానము ప్రకారము ఆ Jaipur estate ఈ బిల్లు నిర్ణయించేది లేదు.

The Hon. Sri K. Koti Reddi:—పూర్వము Madras రాష్ట్రమునకు Andhra రాష్ట్రమునకు సంబంధించినంతవరకు ఆ Act పొడిగిస్తూ వచ్చాము. ఇప్పుడు ఆ Act Andhra రాష్ట్రానికి సవరించు కొనవలసి వస్తుంది.

Sri K. Ramayya :— అధ్యక్షా, మనతోటివున్న ఈ బిల్లు స్వంత దారుల అడవులపై ఆ రోజులనుండి అమలులో వుందని తెలుసు. ఆవిషయము నాకుకూడ తెలుసు. నాకుకూడ కొంత అనుభవమువుంది. దీనిని పురస్కరించుకొని ఇంతవరకు పూనుకోవలసి వస్తుంది. దానివలన మేలు కలగదని నా అభిప్రాయము. ఈ చట్టము ఎంతవరకు పనికివస్తుందంటే అది నేను ఇప్పుడు చెప్పుతున్నాను. అవి zamindars వారి స్వంతదారుల చేతులలో పడడానికే. ఈ విషయములో Government చర్య తీసుకున్నట్లే కనపడటములేదు. అందుచేత ఈ విషయములో నేను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను. జమీందారులు వున్నా లేకపోయిన ఒకటేకాబట్టి దీనిని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను.

The Hon. Sri K. Koti Reddi:—Forest administration గురించి శ్రీ గౌతు లచ్చన్నగారు చెప్పారు. దానికి సంబంధమయిన పరిపాలన ఏమిటంటే ఇందులో ఇతర చిక్కు లేమయిన ఉంటే వారు చూచుకుంటారు. ఈ విషయములో పూర్తిగా administration వారి చేతులలోవుంది. Forest administration లో తప్పు ఒప్పులు ఇబ్బందులు అన్నియు వారికి తెలుసు. అట్టిచిక్కులువస్తే అవి వారికి తెలువవచ్చును. అవి వారు తీరు

28th November 1953] [The Hon. Sri K. Koti Reddi]

స్తారు. ప్రభుత్వముయొక్క హక్కులు, దేశముయొక్క హక్కులు ఎప్పటికి కూడా వుంటుంది. దానికి సంబంధించినంతవరకు 40, 50, 150 forest లు ప్రజలకు ప్రక్కన వుండగా రైతులకు ఇబ్బందులు ఉంటాయా అనే అనుమానము ప్రజకు సహజముగా వుంటుంది. అందువల్ల ఒక ప్రక్కన Forest ను వారు ఉపయోగిస్తుంటే, రైతులు అంత సులభముగా ఉపయోగిస్తుంటే, అంత మేలుచేస్తూన్న మరో ప్రక్క రైతులకు మేలు చేయవలసింది అని అంటారు. దాని అగత్యము కనిపించదు. మీకు అలాంటి భయములేదు. నిజంగా ఏమయినా వుంటే వారికి వివరిస్తే బాగుంటుంది. మీరు ఈ బిల్లును ఒప్పుకోకుండావుంటే ఎవరు నష్టపడతారు. మనం యావన్మందికూడ నష్టపడతాము. ఎందుకంటే ఇదివరకు Forest అనుభవించే వారు Zamindars లో ఎక్కువమంది ఉంటారు. Zamindars కాకుండా ఆ 100 ఎకరాలకు పైగా tax area లో forest వుంటే వాటినికూడా declare చేసి Government order ప్రకారము దానిని తగ్గించుకొనుటకు provisions వుంటున్నవి. ఒక్క Malabar District లో తప్ప మన దేశంలో ఎక్కడ లేవు. అయితే అది Estate Land Act కు సంబంధించిన విషయము. బహుశా ఈ రోజునకూడ మన ఆంధ్రరాష్ట్రములో ఎక్కడా అట్టి పరిస్థితులు లేవు. ముఖ్యంగా Estate కు వర్తిస్తుంది. ఈ Forest Act వచ్చి Estate Land Act కు కూడ వర్తిస్తుంది. కొంత మట్టుకు Estate అంతా తీసుకున్నాను. ఈ Private Forest Preservation Act apply అవుతుంది. ఏమయిన Government యొక్క తప్పు కాదు. High Court మొదలుకొని, Supreme Court మొదలుకొని Writs, Stay Orders ఇస్తున్నారు. తిరిగి రావలసి వచ్చినప్పటికీ ఒక సంవత్సరము హెచ్చుకాదు. కాబట్టి మిమ్మలిని ఒప్పుకోమని కోరుతున్నాను. ఇంతవరకు Zamindars నుండి Estates Government తీసుకున్నప్పుడుకూడ, Forest దానిలోనిది అయినప్పటికీకూడ dispute ఉండి అటువంటిది Ryots వుంటుందని Zamindars లేదని, రైతులు హక్కులేదని Government చెప్పవచ్చు. కాబట్టి ఇది ముఖ్యంగా Sri T. Viswanatham గారు చెప్పినట్లు ఇది Forest వయిన అధికారము కలదనేటటువంటివారు, స్వంతదారులుగా వుండేవారు ఈ Forests 1949 దానికి కొంత ముందు Government కొన్ని Rules చేసి

[The Hon. Sri K. Koti Reddi] [28th November 1953

నారు. 1882 Forest Act ప్రకారము వీటికి కొన్ని Rules వర్తింపజేశారు. Government Forests ఈ విధముగా ఉపయోగించవలసినట్లైతే ఆ Rules ఈ Act క్రింద ఉపయోగిస్తారు. ఇందులో ముఖ్యమయిన వుద్దేశము ఏమిటి అంటే Forests ను నాశనము చేయకుండా చూచుటకేకాని వేరు దురుద్దేశము లేదు. Madras Private Forests Protection Act December 2 వ తేదీతో అంతమవుతుంది. ఇంతలోపల ఏమిచేసిన చేయవచ్చు. కాబట్టి దయచేసి మీరు దీనిని Select Committee కి refer చేయవలసిన అగత్యములేదు. అటువంటి అవసరము వస్తే ఇంకొక రెండు నెలలలో చూద్దాము. ఇప్పటికి ఏమి అవసరములేదని నేను అనుకుంటున్నాను. కాబట్టి దయచేసి మీరు అంతా ఒప్పుకోవడము మంచిదని నేను కోరుతున్నాను. ఈ Act అమలు జరిపించాలంటే ఇందులో ఏమయినా యిబ్బందులువుంటే అటువంటి specific instances మీరు తెలపండి. దీనిని వెంటనే ప్రభుత్వం అమలుపరచాలనే వుద్దేశంతో వుంది. దీనిలో సందేహము specific గా తెలియజేస్తే వాటినిగూర్చి చర్య తీసుకుంటారు. కనుక దీన్ని మీరు దయచేసి pass చేయమని కోరుతున్నాను.

* Sri Vavilala Gopalakrishniah :—అధ్యక్షా ! మొదట తెలియకుండ అసలు నవ్వవచ్చునా ? అందువల్ల నేను మనవి చేయవలసిన విషయం చెప్తున్నాను. ఈ బిల్లును అక్కరలేదని, pass చేయ నక్కరలేదని, అందుచేత దీనిని వ్యతిరేకించడం నా వుద్దేశ్యము. గవర్నమెంటు Forests అన్ని ఆక్రమించుకోలేదు. దానికి కారణాలు వివరించినట్లైతే దానికి అనేక కారణాలు చెప్పవచ్చును. దాని విషయంలో High Court లో Writs వున్నందువల్ల అది effect లోకి రాలేదన్నారు. ఈ బిల్లుకు High Court రిట్ అడ్డుగా వున్నదనే తెచ్చిపెట్టారా ? అసలు విశాఖపట్నం జిల్లాలోను, సర్కారు జిల్లాల్లోనే forest లన్ని వున్నవి. వీటిలో ఎన్ని స్వాధీనపర్చుకొన్నారు ? High Court లో వున్నందువల్ల అన్ని స్వాధీనపరచుకోలేదు చెప్పండి ? కాని, అదికాకుండా యిప్పుడు యీ Select Committee కే పోవాలనే నా ఉద్దేశ్యంకు కారణం. ఇప్పుడు మీరు దానిని సర్దుబాటు చేస్తానంటే నేను నా amendment ను withdraw చేయడానికి అభ్యంతరము లేదు.

28th November 1953]

Mr. Speaker :—మీరు దయచేసి ఈ సవరణను withdraw చేసుకోవచ్చునని కోరుతాను. దానికి సమాధానము ప్రభుత్వం వారు చెప్పిన దానిలో ఉన్నది.

The amendment was, by leave of the House, withdrawn.

Sri Vavilala Gopalakrishniah:—Mr. Speaker, Sir, I beg to move:

"In Clause 2, for the words and the figures '2nd December, 1954', substitute the words and figures '2nd February, 1954."

నేను దీనిని move చెయ్యడానికి ఒక కారణం ఉన్నది. ఇప్పుడు ప్రభుత్వము ఈ పని రెండు నెలలలో చేయగలదా అని అడుగుచున్నాను. ఆ విధంగా చేయుటకు వీలులేదంటే withdraw చేసుకొంటాను.

The Hon. Sri K. Koti Reddi:—వీలులేదండీ.

Sri Vavilala Gopalakrishniah :— అట్లయితే ఈ సవరణను withdraw చేసుకొంటున్నాను.

The amendment was, by leave of the House, withdrawn.

Mr. Speaker :—ఈ బిల్లులో ఇంక వేరే క్లాజులు లేవు. ఉన్న ఒక్క క్లాజు pass అయిపోయింది. కనుక బిల్లు మొత్తంగా వోటుకు పెట్టుతాను.

Sri K. Krishna Rao :— Clause by clause తీసుకోవలసిందని కోరుతున్నాను.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

[28th November 1953

The Hon. Sri K. Koti Reddi:—Mr. Speaker, Sir, I beg to move:

"That the Madras Preservation of Private Forests (Andhra Amendment) Bill, 1953, be passed into law."

The motion was put to vote and carried and the Bill was passed into law.

Mr. Speaker:—సభ్యులకు ఒక మనవి చేస్తున్నాను. Hon. Leader of the Opposition నాగిరెడ్డిగారు మిగిలిన బిల్సును మంగళవారమునాడు తీసుకొందామని అన్నారు. అలాగే చేస్తాము. తరువాత, non-official day, సోమవారమునాటికి, non-official resolutions చాలా వచ్చినవి. అవన్నీ క్రోడీకరించి ఏదో ఒకటి మొదటి తీర్మానముగాను, మిగిలినవి సవరణలుగాను arrange చేస్తామని అనుకొన్నాను. వెంకటేశ్వర్లుగారు ఒక సూచన చేశారు. రేపు ఉదయము 8 గంటలకు పార్టీ లీడర్సు, నేను సమావేశమౌదాము. అప్పుడు పార్టీ లీడర్సు, ఎదో ఒక దానిని తీర్మానంగా పెట్టుకొని, తక్కినవన్నీ దీనికి సవరణలుగా పెట్టుకొనే విషయాన్ని ఆలోచిస్తాము. ఇది లీడర్సుకు అందరికి అనుకూలముగా ఉంటుందనుకొంటాను.

**The House now stands adjournend till 10 A. M. on Monday, the 30th.**

**The House was then adjournend to meet again at 10 A. M. on Monday, the 30th November, 1953.**